వేంకట్రామకృష్ణ గ్రంథమాల

# శృంగార సుధా సముద్ర
# పూర్ణ చంద్రోదయము.

200 సం॥ లకుఁ పూర్వము వ్రాయఁబడిన కావ్యరత్నము.






చెన్నూరి శోభనాద్రికవి.

☞ వేగుఁజుక్క గ్రంథమాలనుండి వెలువడిన శృంగారరస ప్రధాన సరస ప్రబంధరత్నములు-విక్రయమునకు సిద్ధముగనున్నవి.



సరసశృంగారము—పూర్వకవి ప్రణీతము చిత్రపటశోభితము
నిండు కేలికోబైండు—ఫెదర్ వెయిట్
కాగితముపై ముద్రితము విలువ రూ. 2-8-0.

2. శృంగార సురతాణి—పూర్వకవి ప్రణీతము విలువ 2-8-0.

3. శృంగారసంధ్య—విలువ 2—0—0.

కామాక్షి సరసము—విలువ 0—2—0.

☞ పై గ్రంథముల విలువ మనియార్డరుద్వారా ముందుగా మాకు అందఁజేసిన యెడల ఖర్చులు మేమేభరించుకొని పంపెదము వీ. పీ. ద్వారా పంపవలసినయెడల వలయువారే ఖర్చులు భరించుకొనవలెను. నవలలు, డిటెక్టివ్ నవలలు, నాటకములు వగైరా లిష్టుకోరినయెడల పంపబడును.

భాగవతుల నరసింహశర్మ,
వేగుఁజుక్క గ్రంథమాల, బరంపురం, (గంజాం జిల్లా.)



ర-21.

వేగుంజుక్క గ్రంథమాల:—56.

(చెన్నూరి శోభనాద్రికవి ప్రణీతము)

*Printed & Published by:—*

*Proprictor.*

BERHAMPUR, (Ganjam.)

[విలువ 1—8—0.] ఖర్చులు కొనువారే భరించవలెను.

☞ For copies apply to the Publisher.

# శృంగారసుధాసముద్రపూర్ణచంద్రోదయము.

## పీఠిక

శ్రీరంగం సోమేశ్వరశాస్త్రిగారు—బి.ఏ. బి. ఇడి.

"కతి కవయః కతి కృతయః కతి లుప్తాః కతి చరంతి కతి శిథిలాః" అని నీలకంఠదీక్షితులు చెప్పినటుల వాఙ్మయారణ్యమునందనేక గ్రంథములు లుప్తప్రాయములయి యుండును. పరిశోధకులయొక్కయు భాషాసేవకులయొక్కయు దీక్షచే కొన్నిగ్రంథములు పైకివచ్చుచుండును. వీరేశలింగముగారి కవుల చరిత్రయందు మాత్రము శ్రుతపూర్వమయిన యీప్రబంధము నేటిదనుక ముద్రితముకాలేదు. ప్రాచ్యలిఖిత పుస్తకాలయమునందలి శిథిలప్రాయమయిన యొకప్రతినుండి యీప్రబంధమును బ్ర. శ్రీ. భాగవతుల నృసింహశర్మగారు వ్రాయించి తెప్పించిరి. అచ్చటచ్చట గ్రంథపాతములుండుటచే శ్రీ శర్మగారిన్నాళ్లు వానిని పూర్తిచేసి నేటికి తమగ్రంథమాల యందచ్చువేయించిరి.

ఈ ప్రబంధమునందలి కథ బిల్హణీయమని చెప్పబడెడు బిల్హణ చారిత్రము. చెళ్లపిళ్ల నరసకవి యామినీపూర్ణతిలకావిలాసమనియు, పిండిపెద్ది లక్ష్మణస్వామి బిల్హణీయమనియు నీకథనాధారముచేసికొని ప్రబంధములను రచియించిరి. శృంగారసుధాసముద్రపూర్ణచంద్రోదయమును రచియించిన కవి చెన్నూరి శోభనాద్రి. ఇతడు పండితవంశజుడనియు సాహిత్యప్రతిష్ఠుడనియు ననుటకు "ఉ॥ పన్నగసార్వభౌమ పరి-భాషిత" అను పద్యముసాక్షి.

కృతిపతియగు గుమ్మడపుపాపయ్య పద్మనాయక వంశస్థుడు.

ఇతఁడు సామాన్యముగా చిన్నజమీందారయ్యును కవి యితనిని నరనాయక శిరోమణియనియు, ప్రభుకుంజరుఁడనియు సంబోధించుటచే నీతఁడు విద్యాలోలుఁడనియు విద్వాంసులను బహుమానించువాఁడనియుఁ దెలియుచున్నది.

ఈ కవి కవిత్వము పదలాలిత్యము అర్థ సంపదకలిగి మిక్కిలి హృదయంగమముగా నున్నది.

ఈ గ్రంథనామమునుబట్టి సరస శృంగారరస ప్రధానమని చెప్పవచ్చును. అట్లయ్యు నీకవి యసభ్యవర్ణనముల పొంతఁబోక యౌచిత్యభంగముగాకుండ తుదదాక నీగ్రంథము వ్రాసెను. ఈ గ్రంథమును మిక్కిలి శ్రద్ధతోఁ బరిష్కరించి శిథిలభంగములను పూర్తిగావించి యాంధ్రలోకమున కందించిన శ్రీ భాగవతుల నృసింహశర్మగారు ధన్యులు. ఇట్టిగ్రంథములనేకములు వారి గ్రంథమాలయందు ప్రకటింపఁబడుగాక యని మదీయాశయము.

ఇట్లు విబుధ విధేయుఁడు
శ్రీరంగం సోమేశ్వరశాస్త్రి.

THIS CANCELS ALL PREVIOUS RULES.

Estd-in 1911.



1911 సం॥ స్థాపితము.

భాగవతుల

నరసింహశర్మ,

ప్రొప్రయిటరు,

వేగుంజుక్క గ్రంథమాల

ప్రాడుస్వారి వీధి

బరంపురం, (గంజాం).

1936.

## —: నిబంధనలు. :—

నిరూపక నవలలు, సాంఘిక నవలలు, పుణ్యచరిత్రములు, మృదుమధుర ప్రబంధములు, మనోహర నాటకములు, మనోల్లాసకరములగు, ఐతిహాసములు, చక్కనికాగితముపై, రమ్యమగు అచ్చుతో రెండుమాసముల కొకటి చొప్పున వెలువడును.

2. గ్రంథము వెలువడిన వెంటనే ముందుగా చందాదారులకు ఒక్కొక్క గ్రంథము ఒక్కొక్క రూపాయికి నొసంగబడును. ఖర్చులు ప్రత్యేకము, (ఇతరులకు ప్రతిగ్రంథము రూ. 1-8-0) వి. పి. గా పంపినయెడల ఖర్చులధికమగును. గనుక సం॥ చందా ముందుగా మొదటి వి. పి. తోనే వసూలు చేయబడును. ఇది చందాదారులకు లాభకరము.

3. ఆరుగ్రంథములు సం॥కు ఖర్చులతో (వి. పి. చేసిన యెడల) రూ. 9-0-0 అగును గనుక రూ. 6-0-0 ముందు (ఎడ్వాన్సుగా) బంపు చందాదార్లకు ఎట్టి ఖర్చులుండవు.

(రూ 7-2-0 అడ్వాన్సుగాఁ బంపినయెడల 6 గ్రంథముఁ
కేలికో బైండు చేయించి క్రమముగఁ బంపఁబడును.) అ
పంపిన చందాదారులకు చాల లాభముండును. ఈ రశ
గమనించి లాభముఁ బొందుఁడు.

4. చందాదారు లగువారు వెనుకటి గ్రంథము
యొక గ్రంథమునైనఁ గోరిరేని ప్రవేశరుసుము 0-4-0
అట్లుకాక, తాముప్రవేశించిన పిమ్మటనుండి గ్రంథముల
గోరిరేని ప్రవేశరుసుము 0-8-0 మాత్రమే.

5. చందాదారు లగువారు **వెనుకటి** గ్రం
పుచ్చుకొనవలెనను. నిబంధన మెంతమాత్రమును లేద
కోరిరేని (కోరిన గ్రంథములఁ బట్టి) చౌకగా ని
నూతన ప్రచురణము లెప్పటికప్పుడు తప్పక పుచ్చుకొ

6. సం॥ చందా, రూ 6-0-0, ప్రవేశ రుసుము
మొదట వి. పి. తోనే రాబట్టుకొందుము. ప్రతిగ్రంథము
పోష్టు ద్వారా పంపుదుము. తప్పక అందితీఱును.

# గ్రంథరచనా నియమములు.

1. Characterisation. 2. Development of
ter. 3. New Ideas. 4. Historical Beauties.
ription of Nature and other varieties.

గమనింపుడు:- చందాదారులు ప్రతిగ్రంథముఁ
కొనుట తమకు విధియైయున్నది. పంపించిన
గ్రంథము నెంతమాత్రముఁ ద్రిప్పివేయరాదు. ప్రతి
నకు ముందు ఇంటిమీషను ప్రచురింపబడును. ఇష్టము

2670
73

వెంటనే మాకు దెలియఁజేయవలెను. తిప్పివేయక ప్రతిగ్రంథము పుచ్చుకొను చందాదారులు శాశ్వత చందాదారులు. అడ్వాన్సు పంపిన చందాదారులకు ఖర్చులుండవు.

# బహుమానము.

## వేగుఁజుక్క గ్రంథమాల

### చందాదారులకు మాత్రమే.

ఆలోచింపుడు! నష్టమొందకుఁడు!! లాభమొందుఁడు!!

అయ్యా,

సంవత్సరము చందా అడ్వాన్సుగాఁ బంపినయెల, ఈ క్రింద వివరించిన గ్రంథములలో మీరు కోరిన 1 గ్రంథము చితముగా ఒసంగఁబడును. ఇందువలన మీకు సంవత్సరమునకు 6 గ్రంథములకగు పోస్టేజీ కలిసివచ్చుటయే గాక, రూ 1 విలువగల ఒక గ్రంథము బహుమానముగాఁ బడయఁగలరు. సంవత్సరములో వెలువడు 6 గ్రంథములు రెండు నెలల కొకటి చొప్పున క్రమముగ పంపుచుందుము.

రూ 6-0-0 అడ్వాన్సుగాఁ బంపినవారికి సం॥లో వెలువడు 6 గ్రంథములు దిట్టమగు రేపరు బైండు గలవి పంపుదుము.

ఈ క్రింది గ్రంథములలో ఏదయిన గ్రంథముఁ గోరినను బహుమానముగా ఒసంగబడును.

1. [illegible].
2. [illegible]దర్శనము.
3. [illegible].
4. వివాహ[illegible]వము.

5. మరణమందిరము. 6. మేవార్ పతనము.

7. ఉత్తమ వంచకుడు. +

మురళీధ్వని

గమనింపుడు:—ఇతరులు 0-8-0 ప్రవేశ రుసుముతో చందాదారులై పైషరతుల ప్రకారము అడ్వాన్సుగా సం॥ చందా పంపిన యెడల ఈలాభముఁ బొందగలరు. ఈ నిర్ణయము కొంతకాలము పర్యంతమే. చందాదారులు త్వరపడుట లాభకరము.

భా॥ నరసింహశర్మ,

వేగుఁజుక్క గ్రంథమాల,

పూడిపెద్దివారి వీధి బరంపురం, (గంజాం జిల్లా.)

## శ్రీ తులసీ రామాయణము.

(విక్రయమునకు సిద్ధముగనున్నవి.)

| | |
|---|---|
| బాలకాండము, (చిత్రపటశోభితము—మంచిప్రతి) | 2-8-0 |
| * అయోధ్యాకాండము—రెండు భాగములు. | 2-8-0 |
| * అరణ్యకాండము. | 1-0-0 |
| * కిష్కింధాకాండము. | 0-12-0 |
| * సుందరకాండము. | 0-12-0 |
| * మూతాంగదము. | 1-0-0 |
| కుంభకర్ణవధ. | 1-0-0 |

శ్రీరస్తు

శుభమస్తు. అవిఘ్నమస్తు.

శ్రీ శారదాంబాయైనమః

# శృంగారసుధాసముద్రపూర్ణచంద్రోదయము

శ్రీరమణీస్తనంబులను చెక్కుల నొక్కుటనాల్గుచేతులం
గూరిమిహెచ్చగస్తురిని కోమల పత్త్రికలన్ రచించు ల
క్ష్మీరమణుండు నందనసమీహితరాజ్యచిరాయురిష్ట సం
భారములిచ్చి గుమ్మడపు పాపయనుం గృపతోడఁ బ్రోవుతన్.

చం॥ నలినదళాక్షుఁ డాత్మవదనంబునఁ గస్తురిచేత ముద్దుగాఁ
దిలకము దీర్పఁ గౌస్తుభపుఁ దేటలఁ గన్గొని మెచ్చులీయఁగాఁ
బలుమరు గౌగిలించి హరిభావము రంజిలఁజేయు లక్ష్మి స
త్ఫలదతఁ బ్రోచు గుమ్మడపుపాపయకున్ బహుభాగ్యమిచ్చుచున్.

చం॥ సతతము నాభిజాతుఁడయి సార్వజనీన విశుద్ధవార్త్తకె
శ్రుతులరచించి ఛాందసతశోభిల్లియున్ చతురాస్యుఁడాటవా
కృతియననొప్పు పద్మజుఁడ భంగకళాచణ బుద్ధినిచ్చి భూ
పతిమణియైన గుమ్మడపు పాపయనుంగృపతోడఁబ్రోవుతన్.

చం॥ తనపతి మేనికుందనపుఁ దళ్కులపైఁ దనమేని వజ్రపుం
నునుపు(సొబంగుపొంగును)గనుంగొన నెంచి, వినోద వైఖరిన్
వనజజు గౌగిటం బెనచు వాణి సదుక్తి నిరుక్తి యుక్తి గుం
భనములనిచ్చి గుమ్మడపు పాపయనుం గృపతోడ బ్రోవుతన్.

చం॥ శివతనవామభాగమున జెల్వువహించిన కారణంబునన్
శివుఁడను భవ్యనామము ప్రసిద్ధముగా దనకొప్పియుండగా
నవఘన సార(హీరసుర నాగ) శరీరవిలాసభాసియా
భవుఁడుజయంబుగుమ్మడపు పాపయకున్ గృపతోడనిచ్చుతన్

చం॥ తనదు శివాభిదాన (ఘనతన్ మృదుహాసవిభూషణాదులన్)
జననుత చిత్రధోరణిని శంకరుసామ్యమునొందఁజేయుచున్
దనరు భవాని నిత్యసుఖదంతిరథాశ్వయథేష్టవాంఛలన్
పనివడియిచ్చి గుమ్మడపు పాపయనుంగృపతోడ బ్రోవుతన్.

చం॥ ప్రణుతజనావళీ కృతినిబంధన విఘ్నతమశ్ఛటా నభో
మణి, శివలోచనభ్రమర మంజులనీరజమే మహాత్ముఁడా
గణపతిమామకీనకృతి కన్యకకుం గృపతో నిరంతరా
యణాసువచోవిలాస లస దద్భుతపాండితినిచ్చుఁ గావుతన్.

చం॥ హరిపదచారి రాజనుచు నందరు తన్నునుతింపుచుండగా
హరిపదచారిచిత్తుఁడయి యాత్మఁగృతార్థతనొందజేయుచున్
హరిహయునిన్ జయించినమహాత్ముడు తాగ్గ్రస్వాదుభోగ భాగ్యముల్
పరహృతిశక్తి గుమ్మడపు పాపయకున్ గృపజేయుగావుతన్.

# శృంగారసుధాసముద్ర పూర్ణచంద్రోదయము.

శా॥ శ్రీమద్రామపదారవింద భజనాచిత్తుండు లంకాపురీ
హేమోచ్చైస్తనసౌధగోపుర (గృహాహితాగ్నిసత్కృత్యోర్బల)
శ్రీమంతుండసిలాత్మజుండు విజయ శ్రీరాయిన్మా బాగ్రిపుత్రక
భామామన్మథరూపు గుమ్మడపు పాపయ్యప్రభుగ్రామణిన్

సీ॥ కావ్యగర్భంబున గాయత్రివర్ణముల్
కుదిరించె నేమాని కుంజరుండు
సకలోప నిషదర్థ సారకృష్ణాలాప
పద్యముల్ కృతిసే తపస్వి చెప్పె
శైలజా వరలబ్ధ సర్వభాషాకావ్య
నిర్మాణ మొనరించి (వెగడెనెవఁడు)
సకల విద్వత్సమాజము మెచ్చగానలం
కారనిర్మాణమే కవి ఘటించె

గీ॥ నట్టి వాల్మీకి బాదరాయణ మునీంద్ర
కాళిదాసాది దండి సత్కవులపాద
పద్మములగూర్చి వందారుభావమొంది
యాంధ్రకవిచంద్రులను మ్రొక్కి యభినుతింతు.

కం॥ నన్నయభట్టారక ముఖ
సన్నుత సుకవిత్రయాంఘ్రిజలజంబులకున్
సన్నుతులుజేసి శ్రీనా
థోన్నత కవిచంద్రమును మృదూక్తులఁదలఁతున్.

ఉ॥ పన్నగ సార్వభౌమ పరిభాషిత భాష్యపరి (స్ఫుటార్థ) వి
ద్వన్నుతవాగ్గుళీణు, బహుధా పరిశీలితకావ్యనాటకా
భ్యున్నత సాహితీనవరసోజ్జ్వల (బాధురసత్ప్రబంధు శ్రీ)
చెన్నూరి రామచంద్రకవి శేఖరు మజ్జనకుందలంచెదన్.

కం॥ గురులఘు జాత్యుపజాతుల
నెఱుగక భాషాంతరాదు లెనసిన కవితల్
పరికింపలేని కుకవుల
సరసులు గణితింప రార్యసభలన్ మిగులన్.

కం॥ అని యిష్టదేవతా వం
దనముం, బ్రాచీనకవి పదద్వతయశ్లా
ఘనమున్ (కాకవి) జనని
దనముంగావించియున్న తదవసరమునన్.

సీ॥ తన మనోహారమూర్తి తనదు తేజస్స్ఫూర్తి
రాజహంసలను నిరాకరింపఁ
దన ధీరతాహేల తన పరాక్రమలీల
యల గిరీశుల గర్వ మణచిపుచ్చ
దన శేముషీవృత్తి తన భోగసంపత్తి
కుండలీంద్రుల నటుండుండు మనఁగ
తన ధనుశ్చాండిమ తన దయాశౌండిమ
భార్గవరాములఁ బరిహాసింప

గీ॥ ధీర జయ పటుపటహ భాంకార నీర
దారవాసారవారితాదార్క్షపగాధ
భిద్విపద్రాజహంసుండు వితరణస్వ
భావుఁడైన గుమ్మడపు పాపయ్యనృపతి.

మొడియుఁ జాడతరదోర్దండ మండితమండలాగ్ర ఖండిత ఖండూయమానారి మండలేశ్వరుండును, కుండలీశ్వరడిండీర పుండరీకాఖండలవేదండ వేదండారి తార హీరపటీర, నీహారము ధారహిండమాన, మాననీయకీర్తి కర్పూర కరండాయిత బ్రహ్మాండ భాండమండలుండును, మండలీకృతకాండాసన ప్రకాండకాండ, ఖండితారాతి ధనంజయుండును, జయలక్ష్మీసమాసాదిత మహార్ఘ వస్తునిచయసంభరితశాత కుంభస్తంభదేదీప్యమాన నిజనివాసుండును, వాసవసమభోగా భోగుండును, భోగినీ భాగధేయానన హుండును, తారారాజామరభూమిజ సమానమైనందిన దాన ధారా ప్రవాహమహుండును, మహనీయనిరతాన్నదాన, భూదాన గోదాన, కన్యాదాన, హిరణ్యదానాది షోడశమహాదాన ధురీణుండును, పద్మనాయకవంశపయః పారావార సుధాకరుండును, గుమ్మడపు గృహాభిధానుండును, గుళ్లపాటి పురవరాధీశ్వరుండును మారుట్లగోత్ర పవిత్రుండును, జగ్గన్న ప్రభుమణికుమార శేఖరుండును కిచ్చమ్మ గర్భశుక్తిముక్తామణియగు పాపయ్య నరనాయక శిరోమణి యొక్క నాఁడు సకల జనాభీష్ట సంధాయక పరిహృత జగదంహుండగు, మట్టపల్లి శ్రీనృసింహుసన్నిధిమంటపంబున

జీవబ్రహ్మ భేదాభేదోపన్యాస సారోపనిషదు దంతులగు వేదాంతులును, తత్తదధికరణ వాక్యవిచారసర్వాంకషవచో మీమాంసకులగు మీమాంసకులును, సప్తషోడశ పదార్థ నిర్ధారణ కర్కశులగు తార్కికులును, సుష్టిజాత ప్రత్యయప్రకృతి వివేచనాచణులగు వైయ్యాకరణులును, సాంఖ్యయోగగజహాయ రత్నశాస్త్రజ్ఞులును, త్రియావర్త క్రమ జటాఘనావధాన ప్రదీపకులగు నధ్యాపకులును, సకల విద్యాసారసవనహంసులగు, విద్వాంసులును, సకల భాషాకలితంభావులగు సత్కవులును, భారత ప్రముఖేతి హాసకథాధురీణులగు పౌరాణికులును, సకలరాజన్య బిరుద గద్యపద్యప్రబంధ (పఠనజనితసంతోషసంస్తూ)య మానబుధులగు వందిమాగధులును, స్వరనిర్ణయ (నాయకులగు) గాయకులును, మృదువచన ప్రహాసన సంపాదకులగు పరిహాసకులును, వందితసామాజకులగు వాంశిక మారజికులును, చతురోపాయ ప్వతంత్రులగు మంత్రులును, షాడ్గుణ్యోదాయులగు రాయబారులును, విజయోద్భటులగు భటులును, జగన్మోహనసిజవిలాసమోహిత మనః పల్లవద్రష్టలగు, వారపల్లవోష్ఠులును, స్వస్వకార్య ధుర్యతందనర, బంధుమిత్రాను జనసమేతుండై సమున్నతోచిత కనకాసనంబునఁ గూర్చుండి, చిరంతన పుణ్యశ్లోకచరిత్ర శ్రవణ ప్రసంగసంగతాంతరంగుండైన కతంబున

మ॥ ననుశ్రీనాథ పదారవిందయుగవందారు స్వభావున్ జిరం
తన విద్వన్మణి భవ్యకావ్యరచనా నానాచమత్కార బో

ధనధారేయు, నవీనచిత్ర కవితాధాటీ నిరాఘాట వ
ర్ణన మాధుర్యవచోధురంధరుని, భారద్వాజ గోత్రోద్భవుఁ

గీ॥ పిలువ నంపించి గౌరవ ప్రీతి వినతి
దనరఁదన కేల నాదుహస్తంబుఁబట్టి
లేనగవుతోడ మేలి బాలీసుఁ జేరి
కూరుచుండఁగ నియమించి కుతుక మొనయ.

కం॥ ననుఁగని కనుగొనలం
దనుపమ కరుణారసామృతౌఘ మొనయ ని
ట్లనియె మృదుమధుర వాగ్ఘో
రణి సభ్యస్వాంతములను రంజిలఁజేయన్.

గీ॥ తరుతటాకాది సప్త సంతానములను
పతికి నాచంద్రతారార్క భవ్యకీర్తి
నిలుపు సత్కృతి, యనుచు మనీషివరుల
వలన విందుము (సకల కావ్యములయందు.)

కం॥ అదిగాన నాదుమనమున
మృదుమధురవచోవిలాస మేసుర రచనా
స్పదకృతి మీావలనంగొనఁ
గుదురుకొనెన్ బుద్ధి యిట్టి కోర్కె ఫలింపన్.

ఉ॥ చెన్నూరి శోభనాద్రికవి సింహము చిత్రకవిత్వధోరణీ
సన్నుత వాక్య వైఖరికి సజ్జనవర్యులు మెచ్చలింప సం

పన్న నవీనసత్కృతి ప్రబంధముగా రచియించి ధాత్రిలో
వన్నియ కెక్కనంకిత మవశ్యముగా నొనరింపు మింపుగన్.

గీ॥ సుకవి కంఠీరుఁడవు ప్రవి శుద్ధమతివి
ఘన మదాస్థాన పండితాఖండలుఁడవు
సకల రాజన్యమాన్యా, విశాలకీర్తి
శోభనుఁడవీవె, చెన్నాఁగి శోభనాద్రి.

కం॥ చాటువచోధాటీ పరి
పాటిత నవకృతి ప్రధాన భాషణసుమణీ
పేటీముఖ, నీకెనయగు
మేటి కవీశ్వరులు గలరె మేదినియందున్.

ఉ॥ నీ జనకుండు పూర్వమవనీపతి సత్సభలందు ప్రౌఢిమ
భ్రాజితఁ బ్రాఁ బురాణకవి రాజులసామ్యమునంది, నందితో
వ్యాజ నవప్రబంధములు వన్నియ కెక్కఁగఁ జెప్పి యొప్పె శ్రీ
రాజిల రామచంద్రకవి, రాజిత సత్కృతకాభిషిక్తుఁడై.

కం॥ ఆ రామచంద్రకవి కం
ఠీరవసుతుఁడవు వచఃపటిష్ఠఁ కవిత్వ
శ్రీరంజిత విద్యా(దు
ర్వారుండవు) శోభనాద్రివరకవిచంద్రా.

గీ॥ రసములందెల్ల శృంగార రసము మేటి
అని వచింతురు కవివరు లఖిలకృతుల

గాన శృంగార రసముపరిధానమగుచు
బరగునట్లు విచిత్ర ప్రబంధమొందు.

కం॥ విరచింపవలయుఁ బండిత
వరులెల్లరు శాస్త్రసిద్ధవాక్యఘటనకున్
గురుముద మొందగఁ గవితా
సరణికి నుభయ కవిచంద్ర సంఘుముమెచ్చన్.

కం॥ శ్రీవిలసిల్లగ మద్వాఁ
శావళి తత్కృతికి మొదల నంచన్మృదువా
చావైఖరి ఘటియింపుము
కోవిదు లౌననఁ మేలుగూర్చెడిరీతిన్.

వ॥ అని యిట్లు సబహుమానంబుగా జాంబూనదాంబరాభరణ పూర్వక కర్పూరతాంబూలంబొసంగిన నేనును నానంద కందళిత హృదయారవిందుండనగుచుఁ కృతగృహప్రవేశనుండనై మంగళ స్నానాలంకార పూర్వకంబుగా శుభముహూర్తంబున వాగ్దేవ తార్చనంబుసేసి ప్రారబ్ధమాన మాననీయంబగు మత్కృతి కన్యా మణికి నాయకరత్నంబగునొప్పు గుమ్మడిపాపయ్య ప్రభుశిఖామణి వంశావతారంబభి వర్ణించెద.

చ॥ సకల బుధాళి సేవ్యమయి సంస్తవనీయ గుణాఢ్యతంబునై
యకలుషమై (సహస్త) భువనాప్తరమాకర శోభితంబునై
(ప్రకటిత విక్రమంబయిన) పంకజనాభుని పాదపద్మజ
న్యకృతిచతుర్థవర్ణము తదంఘ్రిపయోజములట్లుచెల్వగున్.

కం॥ ఆచరణ జాతవర్ణం
బాచారవిశేష భాసిమై త్రివిధంబై
వేచెలువొందును సుగుణ
శ్రీచయమున వెలను కమ్మ రెడ్లను పేరన్.

కం॥ ఆవెలమ కులమునను తే
జో విలసితుఁడభ్యుదయ విశోభిత చక్రుం
డావిర్భవించె సూర్యుఁడు
నా విశ్వాప్తుండు పద్మనాయకుఁడెలమిన్.

గీ॥ పద్మనాయకవంశ సంభవులుగాన
నవని వెలములు పద్మనాయకులటంచు
మించి రంచిత శౌర్యప్రపంచమహిమ
విబుధ జేగీయమానమై వెలయుచుండ.

గీ॥ పద్మసంఖ్యాతిరిపుల నచ్ఛిద్రశౌర్య
ధైర్యగాంభీర్య చాతుర్యధుర్యులగుచు
పరిభవమునొందజేసిన పౌఢి వెలమ
లవని వెలసిరి పద్మనాయకులనంగ.

గీ॥ పద్మసంఖ్యాకధనము సత్పండితులకు
సుకవిగాయక ముఖ్యయాచకులనొంద
జేసినందున వెలములు భాసురముగ
నవని వెలసిరి పద్మనాయకులనంగ.

కం॥ ఆపద్మ నాయకాన్వయ
దీపకుండై గుమ్మడపు విదితవంశమునన్
శ్రీపతిపదాబ్జ భక్తుఁడు
పాపన్న జనియించె సకల భాగ్యాఢ్యుఁడగుచున్.

శా॥ ధాత్రీదేవ(పవిత్రపాదకమలద్వంద్వా)ర్చనాబుద్ధి యా
ర్తత్రాణాన్నప్రదానతోషిత కవీంద్రద్విట్ప్రకాండుండు నై
గోత్రేంద్రప్రతిమానధైర్యుఁడు క్షమాగోత్రుండు భూమీసలిత్
పాత్రస్తుత్యగుణుండు గుమ్మడపు పాపన్నప్రభుండొప్పుగన్.

సీ॥ ద్విజరాజ భావంబు నిజముగా నొనరించి
దోషాకరత్వంబు దొలఁగఁ జేయు
ఈశశేఖర ధర్మమే పారఁ గాంచియు
మిత్రోదయగ్లాని మేకొనండు
సాధువందిత కళాసాహిత్యము భజించి
గురుసాపరాధత దొరయనీఁడు
విష్ణుపదాసక్తి వెలయుఁగ పట్టుఁగానియు
నెఱి నిశాటత్వంబు దొరలనీఁడు

గీ॥ వినుతమగు గుమ్మడపు వంశమను పయోధి
జనన మొందిన పాపన్న జనవరుండు
చిత్రముగఁ జంద్రధర్మ విశిష్టశిష్ట
సరణి కొప్పియు భూపాల చంద్రుఁ డయ్యె.

మ॥ భవశౌర్యోన్నతుడైన గుమ్మడపు పాపన్న ప్రభుండాజిలోఁ
పవితుల్యాసిఘరించి శాత్రవులఁ దుర్గంపంబూన, వారత్తఱిఁ
గపులో హా యనుచున్ వచించు గతిపిఖ్యాతిన్ మాదిస్తోత్రమా
హావభీతిన్ భజియింపఁదత్పురము లాహానిల్చెఁజిత్రంబుగన్.

చం॥ ఘనతర శౌర్యశాలియనగా ధరణీపతి చెన్నుమీరె పా
వననవకీర్తి హారుఁడయి భవ్యగుణోన్నతుడై సమస్త భూ
జనములు తన్ను సంతతము సన్నుతిఁజేయఁగ నీతిశాస్త్ర బో
ధనమహనీయ ధర్మమున ధారుణి యేలుచు భాగ్యవంతుఁడై.

గీ॥ ప్రజలు జేజేయటంచు సంపదలఁబొదల
ధర్మమార్గంబుఁదప్పక తానువారి
వలన ధనమార్జనము జేసి వనతటాక
దేవతాలయసంస్థావిధిద్విజాతి
పరిణయంబులుజేసెఁ బాపన్న మిగుల.

సీ॥ భవ్యసుధర్మాధి పత్యంబు గొనుటచే
నీభోగమహనీయుఁ డింద్రు(డనుచు)
లలిసర్వమంగళాలయశాలి గావున
నీభాగ్యసంపన్ను డీశు(డనుచు)
చక్రిసారప వి(కసనధా)ముఁడౌటచే
నీలోకబాంధవుండినుఁడో యనుచు
(నిర్వక్రవిక్రమధూర్వహుండౌటచే
(నీ చక్రవర్తి లక్ష్మీశుఁడనుచుఁ)

సీ॥ విబుధ కవిరాజ శాత్రివవితతి యెంచ
గుణసముదు్రిందు మారుట్ల గోత్రిమహితుఁ
డవని పతులకు మేటిరైమె యవనిజెలగె
పుణ్య చరితుండు పాపన్న భూధవుండు.

సీ॥ పుండరీకాక్షునకు, రమాభూము లట్ల
గుమ్మడపు పాపన ప్రిభు కుంజరునకు
భార్యలిరువురుగలరు సంపన్న శీలు
రైన చెన్నమ్మ వెంగమ్మయనెడువారు.

సీ॥ దేవబుధగురుజన భూమిదేవతలకు
పూజలొనరింపుచును బహుపుణ్యలగుచు
్మగనికిఁబి్రియంబు సేయుచు మహిమ వెలసి
రవనిఁ జెన్నమ్మ వెంగమ్మ లనెడు సతులు.

వ॥ పురంధి్రమణియగు మల్లమ్మయు వితరణ రణపాండిత్య సనాథుండగు జగన్నాథుండును భక్తియుక్తయగు తిరుమలమ్మయును

కం॥ సన్నుత సద్గుణుఁడౌ పా
పన్న ధరాధీశుఁడగ్ర భార్యామణి సా
చెన్నమ్మయందు సంతా
నోన్నతిఁగనియెప్పె బుధమహోదయుఁడగుచున్.

సీ॥ రెవ్వరనిన

కం॥ ఆసేతు హిమాచల మ
ధ్యాసీనావని ధరావరాగ్రణియగుచున్
భాసిల్లె జగన్నాథుఁడు
వాసవసను భోగభాగ్యవంతుండగుచున్.

సీ॥ అర్కమండల సమానాతి తేజుండయి
యర్కమండల సమానాతికీర్తి
చంద్రాచల విలసత్సార స్థైర్యుండయి
చంద్రాచల విలసత్సారకుండు
మాధవసంకాశ మహితవిశాలుఁడై
మాధవసంకాశ మహితదయుఁడు
పవమానసందన పటుభక్తి శాలియై
పవమాన నందన పటుబలుండు

గీ॥ వాక్పతి సమాన నీతి సర్వాంకషుండు
వాక్పతిసమాన శేముషీవంతుఁడౌర
గుమ్మడపు పావనప్రభు శర్మతనయుఁ
డైన జగ్గన యొప్పెనిత్యంబు ధరణి.

ఉ॥ రంజిలె ధాత్రి గుమ్మడపు రమ్యకులీనుఁడు జగ్గనాఖ్యుఁడా
కంజభవాంగనాహాలిమృగాంకవృషాంక వృషాహినాయకా
రంజితతారహార మృగరాజ హిమాచలకీర్తి నుల్లికా
పుంజ ఘుమంఘుమంఘుమిత భూరి వారిత్తరుణీకచాళియై.

సీ॥ కంబుతోఁ బుండరీకంబుతోఁ బృథుతార
కంబుతో నవమౌక్తికంబుతోడ
భవునితోఁ బురుహూతభవునితోఁ రేణుకా
భవునితో నగ్నిసంభవునితోడ
కంతుతోఁ రోహిణీకాంతుతోఁ నంభోజ
కాంతుతోఁ, జంచద్వసంతుతోడ
గురునితో దైతేయగురునితోఁ గీర్వాఘా
వరునితోఁ గూఢపాద్వరునితోడ

గీ॥ కీర్తి బాహుపరాక్రమమూర్తి రామ
ణీయక మనీషలాగి చెల్మి నెఱపుచుండ
మహి మహావీరుఁడై యొప్పు మహిమమీఱ
గుమ్మడపు జగ్గన ప్రభుకుంజరుండు.

చం॥ సమరకిరీటి యీతఁడన జగ్గనృపాలుఁడు నచ్యుతాప్తుఁడై
విమత గురు ప్రవీరులను వీఁకనుదాఁకగ భీష్ముడంచ పు
త్రమనువికర్ణశల్యముఖ బాంధవసైంధవయుక్తి శాత్రవుల్
మముదయజూడు తాతయన మైత్రివిహీనులఁగ్రాచు సత్వ్రపన్

చం॥ సమర ధరిత్రి గుమ్మడపు జగ్గనృపాలుని ఖడ్గధారచే
విమతులు దెళ్లి విష్ణుపద వీథిసిదాటి యనంతరత్నభే
దము నొనరించిమించి హరిధామముఁ జేరియు వారుణీమనో
రమసుఖపాన సౌఖ్యముల రంజిలుచుందురు చిత్రమెంచినన్.

సీ॥ మెచ్చ దెవ్వారికైన మెచ్చెనా యల సదా
శివురీతి నిష్టార్థసిద్ధులొసఁగు
ఆడఁ డెంతటికైన నాడెనా యల హరి
శ్చంద్రుభంగిని సత్యసంధుఁడగును
వ్రాయఁ డెంతటికైన వ్రాసెనా యాదిమ
బ్రహ్మ చాడ్పునయదార్థం బె వ్రాయు
చూడఁ డెంతటికైన చూచెనా కమలాక్షు
వలెఁ దనయంతటివానిఁ జేయు

గీ॥ భళిరె యాతనితో సాటిగలరె శత్రు
వీరవేశ్యాభుజంగుండు వెలసెననుచు
నవని సరసులు వినుతింప నలరుచుండు
గుమ్మడపు జగ్గన ప్రభుకుంజరుండు.

చం॥ జననుతుఁడైన గుమ్మడపు జగ్గనృపాలుఁడు రాజశేఖరుం
డనఁదగి పూర్ణపౌరుషమునందెను. లోకపతిత్వమూనియున్
ఘనతరసాభిజాత్యమును గాంచెను సత్పురుషోత్తమత్వముం
గని, సతతంబుఁ బుణ్యజనకారుణికత్వముఁబూనుఁజిత్రమే.

శా॥ సారోదారుఁడు ధైర్యశాలి మృదువాచావైఖరీదక్షుఁడం
భోరాశిప్రతిమానసత్కృపుఁడు నంభోజాక్షసద్భక్తుఁడున్
ధీరోదాత్తవతంసుఁడీతఁడనధాత్రిన్ సభ్యులోహోయనం
గా రాజిల్లెను మేటి గుమ్మడపు జగ్గన్న ప్రభుండుర్వరన్.

సీ॥ బంధుదాయాద మిత్రసౌభాగ్యవృద్ధి
కాగకుండయి యాచకకల్పకమయి
కామినీ దృక్చకోర రాకామృగాంకుఁ
డయి ధరిత్రిని జగ్గన్న యలరుచుండె.

కం॥ నిరతము దేవబ్రాహ్మణ
గురుబుధకవివంద్యముఖ్యకోటుల ధనధా
న్యరుచిర కనకాంబరముల
నరయుచు రక్షించు జగ్గనాహ్వయుఁ డెలమిన్.

కం॥ ఆజగపతి పతిరత్నం
బౌ జగ్గన్నకు ప్రియాంగ నాగాంబ సుగుణ
భ్రాజిత కిచ్చమ్మయనన్
రాజిలు పతిభక్తియుక్తి రమణీమణియై.

గీ॥ మహితుఁడైనట్టి జగ్గన్నమాన్యరీతి
ననఘుడైనట్టి కిచ్చమ్మ యందపత్య
ఫలము జెందెను ముప్పుర నలఘుమతుల
సుగుణ సౌభాగ్య ధౌరేయ శుభచరితుల.

వ॥ వారెవ్వరనిన

గీ॥ సుగుణ ఖనియైన పాపమ్మ శుభచరితయు
భవ్య సత్కీర్తియైన పాపయ్యనృపుఁడు
ననఘ సౌందర్య విజితస్మరామృతాంశుఁ
డైన వెంకటరాయభూజాని మౌళి.

కం॥ ఆపాపయ్య ప్రభుఁడు ధ
రాపతితిలకుఁడు భూరిరణవితరణ సం
తాపిత తోషిత వైర్యవ
నీప వనీపకుఁడు వాని నేర్తురె పొగడన్.

సీ॥ ఆది భిక్షుత్వ భూతాధిపత్యంబుల
నంది దిగంబరుఁడైన శివుఁడు
సత్ప్రభావారణాద్విజత్వముల్ గని ఖగ
భావ మొందిన పద్మబాంధవుండు
చక్రిరిమై మిత్ర సంపత్తి నోర్వక
దోషాకరుండైన తోయజారి
జాతివైన్యఫలాశ సామనస్యములొంది
మధువసంతోషియౌ మాధవుండు

గీ॥ ఆద్యలోకేశ సాక్ష్యమృతాంశవిప్ర
రాజ సచ్చక్రసఖ దోషరహిత సుకవి
విబుధగణయుత పాపయ్య విశ్వ విభుని
భాగ్య తేజస్వితాకాంతి పరమదాన
కలన శివహరి శశిమిత్రు లలరజోడె.

ఉ॥ చిత్రము గుమ్మడంపు కులశేఖర పాపయ శౌర్యధుర్య శ్రీ
శాత్రవకోటి తాము పురసంతతులన్ విడిపోయియున్ వడిన్
మిత్రవిభేదనం బసరి మేయు ఖగాకృతిఁ జేసి స్వస్థలిం
గోత్రమునాజ్ఞ దివ్యసతి గూహనకేళులఁ దేలియుండుటల్.

మ॥ ప్రకృతి ప్రత్యయరీతి వృద్ధిగుణ పుంభావక్రియాకారక
ప్రకటస్థాన విధానధోరణి, విసర్గస్థాన లాభాభిదా
యక సూత్రంబులు సిద్ధివిగ్రహము లుద్యద్వృత్తి యుంగల్గి భ
వ్యకళాభూషుఁడు శబ్దశాస్త్రముగతిన్ పాపయ్య యొప్పెన్ ధరన్

సీ॥ అంగసౌష్టవమున హరిసూనుఁడనవచ్చు
నతిధనుఃపాండితి నట్టివాఁడు
అతిదాన ధుర్యత హరిసూనుఁడనవచ్చు
నతిధర్మ నిర్ణీతి నట్టివాఁడు
నతిభుజాబలశక్తి హరిసూనుఁడనవచ్చు
హరిపదాంబుజభక్తి నట్టివాఁడు
నతిదయాసంపత్తి హరిసూనుఁడనవచ్చు
నతిబుద్ధివిశదత నట్టివాఁడు

గీ॥ నృపతిమాతుృండె బిరుదమన్నియు విభాళ
మన్నెహంవీర కుమతిదుర్వృత్తశత్రు
మన్నెవేశ్యాభుజంగుఁడై మహిని వెలయు
గుమ్మడపు పాపయప్రభు కుంజరుండు.

మ॥ కరపద్మంబులు మత్స్యవత్సకుల భాగ్యంబున్ గనన్ మోముప
ద్మిరహింగుంతల లక్ష్మి నేలుకొన వాగ్వైత్సంబు గాడపరిస
న్నరుచిన్ గెల్వగ, ధర్మవర్తనము కర్ణాటస్థితిం గూర్పని
స్థిరఁబాపయ్య యనేక దేశములకుం చిత్రంబుగా రాజగున్.

సీ॥ ఈతఁడేనా రిపుక్ష్మాతలాధీశ జీ
మూత జంఝూవాత హేతికరుఁడు
ఈతఁడేనా దిశాయాత విద్వద్వ్రాత
గీతవస్తు ప్రదానాతిచరణుఁ
ఈతఁడేనా క్రమకాతరాక్షి దృగ
బ్జాత నూతన రవిద్యోతనుండు
ఈతఁడేనా తోయ జాతలోచననాభి
జాతవంశ పదాంబుజాతభక్తుఁ

గీ॥ ఈతఁడేనా సునీతి మార్గేష్టబుద్ధి
ఈతఁడేనా విశుద్ధ సమిద్ధ కీర్తి
ఈతఁడేనా జగన్నాథ భూతలేంద్రు
నందనుండైన పాపయ నరవరుండు.

సీ॥ ఉగ్రసేనాపాలి తోర్వీతలుండయి
బలభద్రసాహాయ్య పటిమఁబెంపు
దనరి, ప్రద్యుమ్నాది దాయాదులనుగూడి
యనిరుద్ధ బాణ జయంబునొంది
ప్రీతి కుచేలదారిద్ర్యసంహర్తయై
యక్రూర మహిత సఖ్యంబు నెఱపి
పౌరి మధురాభిఖ్య పురభూషణంబునై
పురరక్షణక్రియాపరతఁ జెంది

గీ॥ విదిత విశ్వాస కృతియెల్ల కుదురుపరచి
సతత వసుదేవ సమ్మదాచరణుఁడగుచుఁ
కృష్ణుకరుణను గోపాల కృష్ణురీతి
ధరణి నొప్పారె పాపయ్య ధరణిధవుఁడు.

గీ॥ బడుగు బాపల బుడుతల వడుగులెన్న
యేని సేయించుఁ దగునిది, యింకనొకటి
వడుగులకుఁజాల పెండ్లిండ్లు పుడమి నొనర
సేయుట తలంచిచూచిన చిత్రమయ్యె.

సీ॥ ఉత్పన్న దేవాల యోత్సవంబులు భిన్న
పద్మాకరసమూహ బాధనంబు
• దారిద్ర్య పరిభూదాన గోదాన క
న్యాదానవర్షాశన విధాన
నిర్మాణపాలన నిరతాన్నదాన య
థార్థ వాచావక్తృతావిలాస
మతిధర్మశీల దాయాదిబాంధవ మిత్రి
వర్గసౌభాగ్య నిర్వక్రబుద్ధి

గీ॥ గలిగి, రాజన్యమాన్య నిష్కంట కాగ్ర్య
రాజ్యసామ్రాజ్యపూజ్యత్వ ఠమ్యుఁడగుచు
ధరణినొప్పెను పాపయ్య ధరణి ధవుఁడు
(అహహ! భూలోక దేవేంద్రుఁడని నుతింప.)

కం॥ ఆ పాపయ్య సహోదరుఁ
డై పొలుపువహించినట్టి, యనఘుని సుగుణ
శ్రీపతి వెంకటరాయుని
నా పద్మోద్భవునకైన నలవియెబొగడన్.

చం॥ జనులకభీష్ట మిచ్చు ననిశంబునుకానుకలిచ్చి నేర్పునన్
తను ప్రజలెల్ల గొల్వగను దానమహోత్సవశాలియయ్యెభూ
రినవ ధరామరాకలన రెండవవెంకటరాయుఁడోయనన్
వినుతికి నెక్క గుమ్మడపు వెంకటరాయుఁడుదేవమాన్యుఁడై

చం॥ విలసిత సుందరాంగుఁడతి విశ్రుతకీర్తి విభూషణుండు దో
ర్గలిత పరాక్రమోజ్వలుఁడు రాజితదాన కళావిశారదుం
డలఘువచో విలాసమహదద్భుతనైపుణసన్నుతార్యుఁడున్-
వెలసె ధరిత్రి గుమ్మడపు వెంకటరాయుఁడు భాగ్యవంతుఁడై.

కం॥ ఆవేంకటరాయుఁడు హృద
యావిర్భూత ప్రమోద మతిశయమొందన్
గావింపగఁబాపయ్య ధ
రావరుఁ డానందమొంది రంజిల్లు ధరన్.

కం॥ రాజన్యవతంసుండన
రాజిలు పాపయ్య భార్య రమణీ రత్నా
బీ జగతినొప్పు సుగుణ
భ్రాజిత యచ్చమ్మకాంత భూవిలసితయై.

సీ॥ పరమ పాతివ్రత్య భవ్యగుణంబున
నల యరుంధతి సాటి యనఁగవచ్చుఁ
పతిభాగ్య సంధాన బంధురయుక్తి చే
నంభోధికన్య జోడనఁగవచ్చుఁ
ప్రియసర్వమంగళాభిఖ్యాభిదానత
నద్రీంద్ర తనయ యీడనఁగవచ్చుఁ
సౌందర్యధుర్యతా సాహిత్య సంపత్తి
నంగజాంగన యుద్ది యనఁగవచ్చుఁ
గీ॥ అనుచు జగతిఁబురంధ్రులు వినుతిసేయఁ
జెలఁగు నచ్చమ్మ యనుప్రేయ సీలలామఁ
గలిసి పాపయ్య యానందకలననలరి
సుగుణ సంతానశాలియై సొంపుఁగాంచు
శా॥ శ్రీపత్యన్వహ సత్కృపా విలసన శ్రీవృద్ధితానేకరా
జ్యాపారద్విరదాశ్వ వీర భట దివ్యత్పుత్ర పౌత్రప్రవా
చాపాండిత్యచిరాయురుజ్వలయశఃసంపత్తిఁ బాపయ్య స
దావ్యాపారోన్నతివృద్ధిఁబొందుధరలోనాచంద్రతారార్కమున్

—షష్ట్యంతములు—

కం॥ ఏతాదృశగుణ సుమణిస
మేతునకున్ బాహుబల (సమృద్ధ నిరోధా)
యాత(ద్విణ్నృపతితమా)
కాతరతారహిత శాతకార్తేయునకున్.

కం॥ చండభుజాదండ లస
త్కాండాసన(కాండకాండద వినిర్యత్ స)
త్కాండాళి కాండ (మండల
దండిత రిపుకాండగర్వ దవదహనునకున్.)

కం॥ వితరణరణ పోషిత శో
షితసువసీ పావనీ సింహునకు యశో
వితతలసన్మౌక్తిక భూ
షితదిక్కాంతా లలామ సీమంతునకున్.

కం॥ ధాటీ ఢాక్కా కన్నిజ
ఘోటీఖురపుటనిశాతకోటీ బహుధా
పాటిత భూమిపరాగో
ద్ఘాటిత విద్విణ్మహీశ సముదాయునకున్.

కం॥ నిరతాన్నదాన కలనా
పరతాతంత్ర్య మాన భాసురకీర్తి
స్ఫురణునకుఁ బ్రిజాక్షేమం
కరునకుఁబాపయ్యరాజ కందర్పునకున్.

వ॥ అంకితంబుగా నాయొనర్పంబూనిన శృంగారసుధాసముద్ర పూర్ణచంద్రోదయంబను మహాప్రబంధమునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

# కథా ప్రారంభము.

కం॥ శ్రీరమణీమణి సుకటా
క్షారాధ బుధేంద్రనుత మహారాజ్య రమో
దార (యశఃస్ఫురిత,కకు
ప్పారా గుమ్మడంపు పాపయ్యనృపా.

గీ॥ వెలయుఁ గనకనగోత్త రోర్వీతలమునను
రమ్య పాంచాల దేశాంతరమున మిత్రి
పాలితంబగు లక్ష్మీ నివాసపురము
భువన భక్తాళి సేవితాంభోజమనగ.

చం॥ లలనలు చంద్రశాలల విలాసపుఁ గూటమిగొండ్లిపల్పుఁ గ
ల్వలఁ చెలిడాయ, నీవు సరివత్తువు మాముఖలక్ష్మికంచు లో
కులు గణుతింతురింతయన గూడునె యోడితివంచుఁగాటుకన్
నిలిపిరి ముద్ర; దాన శశి నీలిమనొందెను వేరగల్గునే.

చం॥ పురినవవజ్రసౌధముల ముగ్ధలు రాత్రులఁ గేళిసల్పి బం
ధరతి విభిన్నహారములఁ దాముపయింటలఁ జక్కఁ జేయగాఁ
దొరగిన మౌక్తికంబులని దోయిటనెత్తఁ గఁజూతు రుజ్వలో
పరిమణి బింబితాక్షముల (పౌఢసఖుల్ తముఁజూచి నవ్వగన్.)

చం. కలికిమిటారి కత్తెలు జగానెలరాలను దాపినట్టి మే
డలఁబువ్వింటి రాజు జగడంబులఁజేసి యలంతనొంది ప

చ్చలచెలువుల్ పరాయల్ గులుకుఛాయలగు మ్మరువేళబూనినా
దలఁపున డిగ్గుచందురునెదన్ గల లేడిని మెత్తురెంతయున్.

గీ॥ ఇంద్రనీలసౌధ సాంద్రకాంతిచ్ఛట
ఘనఘనాఘనంబు ననుకరింప
నటచరించు కాంచనాంగులు మెఱపులై
మెఱయ హంస లచట మెలఁగనోడు.

ఉ॥ చొక్కపు మేడలన్ మణుల శోభలు గుంపులుగప్పుకొన్న చో
చేక్కని మింటనుండు రవిచందము జూడగనొప్పు నప్పురిన్
చిక్కని (కేతువాయువులచేఁ దెగి ద్యోధుని) రక్తపద్మమీ
డిక్కున (కేగుదెంచెననిదేవతలెల్లరు సంభ్రమింపగన్.)

గీ॥ శ్రీధర వృషాధి వసుదేవ శోభితంబు
విబుధగణ సర్వమంగళా వేష్టితంబు
రజత కమ్రప్రభాసార రమ్యమైన
పురము కైలాస మనఁనొప్పెఁబొలుపుమిగిలి.

చం॥ సురచిర చంద్రకాంత మణిశోభిత దిక్తటసౌధవీధి కా
గురుశిఖరాగ్ర భాగపరి గుంభిత భాసురపద్మరాగ సుం
దరరుచిజాల దంభరవి దర్శన ఫుల్ల సురస్రవంతినీ
వర కనకాబ్జలుభ్యదలివారము తత్పురమెన్న శక్యమే.

గీ॥ తనకువలయాప్తి విష్ణుపదప్రసక్తిఁ
(దలఁచిరాజైన ద్విజరాజు దాటఁబోవు

సరణిగాదని యమృతాంశు సరణి మేర
మీాఱకటనిల్చెఁ బ్రోలిప్రాకారరేఖ.

చం॥ పురిపరిఖాజలంబులు ప్రభూతతటద్వయ పద్మరాగ సుం
దరరుచిజాల సంగతులఁ దద్దయు రక్తిమఁ జెంది యంత భా
సురభుజగేంద్ర మస్తపరిశోభిత మౌక్తిక సంచయప్రభా
వరణము బూని పాండురతఁ బాటిలె నెప్పటి యట్ల వింతగన్

కం॥ సుమనస్సంతానాగమ
కమనీయంబగుచు సౌధగంధర్వగురు
ప్రమద బల శాత్రవాంతక
మమరావతి యనఁగ నొప్పు నప్పురి మిగులన్.

మ॥ శ్రుతి సంపన్నుఁడుగాక నిత్యముచరించున్ వక్రవృత్తిన్ భుజం
గతతి శ్రేష్ఠుఁడనంతుఁడెంతయునివకాకాణించుతురప్పట్టణ
స్థితివిప్రుల్ విధి నాభిజాతుఁడని బుద్ధిన్ మెచ్చరెల్లప్పుడున్
శ్రుతిసంపత్తి లసత్ప్రవృత్తి బుధులై శుంభత్సమారంభులై

చం॥ శరము సురారి సూతుఁడల సారసజాతుఁడుతూణ మబ్ధి వి
ల్ధరణిధరేంద్రమన్నిటను లావరియయ్యెఁబురత్రయంబుఁదా
నరుదుగగెల్చెదానఁదిపురాంతకుఁడన్న సమాఖ్యనొందియున్
నరునకు నోడెనంచు నొకనాటికి రాజులుమెచ్చ రాశివున్.

చం॥ అరయఁగ రాజరాజని ధనాధిపు డంచు సఖుండటంచునా
హరుఁడు సమాశ్రయింపఁగ దిగంబరుఁజేసెనటంచుఁగిన్నరే

శ్వరుని తృణీకరించి పురివైశ్యశిఖామణు లాత్మమిత్రులు
స్ఫురతరభాగ్యభాక్త్వమునఁ ద్రోటిల నొప్పునఁ గొప్పమీఱుచున్

ఆ॥ వె॥ ముఖ్యసేన తమకు ముఖ్యమౌనని విధి
చరణభవులు విప్రచరణసేవ
సేయ వారి వినుతిసేయ నేర్పెయ్యది
భవునకైన నబ్జభవునకైన.

మ॥ కరముల్ సాచి ఘనాఘనస్థ నవముక్తారత్నరత్నంబు లా
దరమొప్పన్ నిజమౌక్తికాగ్రిమణిసంతానప్రదానంబు తా
రు వడంజేసి గ్రహించురీతిని కరాగ్రోదంబు పైఁజల్లుచుం
బురిదంతావళముల్ దనర్చు విచరద్భూరిభ్రమంబూనుచున్.

కం॥ ప్లుత(రేచితవల్గిత ధా
రితముఖగతులన్) నితాంత కృతివిస్మయతన్
గతపక్ష పక్షివరులన
నతివేగముఁగల్గి పురిని హయములు మెలఁగున్

ఉ॥ కేతనవాత ధూత దినకృద్రథవేగములై రథాంగశం
ఖాతత శాఙ్గ శోభిత గదాసి నిరంతర కాంచనాంబర
శ్రీ తలిచే మురారి క్రియఁ జెన్నువహించినయట్టి స్యందన
వ్రాతము లప్పురిన్ మిగుల రమ్యములై కనుపట్టునెప్పుడున్.

చ॥ ఒకతఱి నరథపౌరుషము నొందిన వాని జయించినంతనే
ప్రకట పరాక్రమంబుగల బంట నటంచతిగర్వమైన వా

నికత యదెంత గొప్పని తృణీకృతపాండవ మధ్యముల్ సమి
(త్సకల కళాప్రవీణభట సంతతు లొప్పఁగరప్పురంబునన్.)

సీ॥ కర్పూర కస్తూరి కా మలయజగంధ
(పన్నీర మాదండు) వన్నెమీఱ
హెచ్చైన యచ్చంపు పచ్చలన్ (దనరు తో
రణములు చిల్కల రంగులీన)
జాళువా బంగారు జగ్గులీనెడు (మంచి
యనఁటులువాకిళ్ల నంద మొంద
ధళధళలొల్క నిద్దా యాణిముత్యంపు
ముగ్గులు కలకల ముద్దుగూర్ప

గీ॥ మేలినీలాల మేడల చాలుకాంతి
చదలఁ మచ్చను భ్రాంతిని కుదురుపఱుప
నలరు నయ్యార్యెయని చూపరులునుతింప
జగతి లక్ష్మీనివాసాఖ్యనగర మొప్పు

సీ॥ బంగారు గుబ్బలు పగడంపు ద్వారబం
ధంబులు పచ్చల దండిగడప
లొప్పైన వజ్రాల గొప్ప డాకట్టులు
ఘనమైన పద్మరాగము లనెలులు
ముద్దులు గుల్కెడు నిద్దంపు కెంపుల
తలుపులు నీలంపుస్తంభములును

చొక్కంపు ముత్యాల చూరులు పుష్యరా
గములఘట్టెలు కలకలనుసొంపుఁ

గీ॥ బెంచు వైడూర్యమణులు తీవంచముద్దు
టరుగులును కుందనపుఁజొక్కమైన చెక్క
(డంపుఁబనుల విడంబించి డంబమీఱు
నప్పురము హెచ్చు వినుతింప నలవిఁయగునె.)

సీ॥ కనుఁద్రిప్పఁచును గిరుక్కున మళ్లి చూచిన
వేదాంతియైనను వివశుఁడగును
ఘమ్మనుపయ్యంట గాలిసోకిన మౌని
యైనను మాయురే యనుచునిలచుఁ
తొలగినపైట గుబ్బలజాళువా ధగ
ధగ దీప్తి మరునైన బెగడుపఱచు
వగగుల్కఁదియ్యని సొగసుమాటాడినఁ
గనక గర్భుండైన వెనుకకేగు

గీ॥ నిలచు మెఱుపులాయని చూపరులు వచింప
సమణిగణహేమ (ఘల్లుఘల్లాచరణ చరణ
మంజు మంజీర లాత్మ సంభవనిశాత
సాయకము(లట్టులలరు వేశ్యా గణంబు)

సీ॥ (అలికుచంబుల నంటుసిమ్మ వెలంత)?
కొనగోటిపైమించు కోసకు జాణ

చూడుమా నీదండ జోడుగావలెఁగొమ్మ
పలుకొమ్మ దొరకినఁ బట్టు దిట్ట
కొప్పైన పెదవిరి (దింపు శేరంబెంత? పలు)
మోపు(కొనుటకు) నెలవుగలదె
కలువనే గోరెద విలువజెప్పుము రామ
యొక్కటియైన నా కోరుపిచట

గీ॥ ననుచు నీరీతి వగగుల్క వలచి నవ్వ
దొలుకగులుకుచు విటకాండ్రతోడ ముద్దు
లొలుకఁ బలుకులఁ బలుకుచు నలవు మీఱఁ
బువ్వులమ్మెడు రవ్వీటఁ బూవుబోండ్లు.

కం॥ ఆరాజధాని కధిపతి
ఘోరాసి మృగేంద్రదళిత కుటిలారాతి
క్ష్మారమణ మత్తకుంజర
వారుఁడు మదనాభిరామ వసుధేశుఁడనన్.

సీ॥ తన చంద్రహాసోగ్రదంభోళికిని పర
క్ష్మాభృద్ధావళి విపక్షత వహింపఁ
తనకీర్తి పూర్ణచంద్రప్రభావళి కొప్ప
రాజ జీవంజీవ రాశులలర
తన నిరంతరదాన ధారామృతమునకు
నోగి బుధేంద్రులు తృప్తులగుచు మెచ్చ

తన పద్మిణీ గరుత్మాన్మంత్రి దేవత
కేతులు దుందుభ రీతిబూనఁ

గీ॥ బఱగుఁదారుణ్య లావణ్య భాగ్య భోగ్య
భాసమానా సమాన రంభామనోహ
రాంగ మదనాభిరామ సానంగశాస్త్ర
ధీమహిత హేళి మదనాభిరామమౌళి.

ఉ. ఆమదనాభిరాముని మహాద్భుత విక్రమమున్ ప్రతాపమున్
తాము సహింపలేమనుచుఁ దద్దయుభీతిలి యౌర్వవహ్నియుం
ద్యోమణియుం బ్రసిద్ధగతి దోఁచగ బాడబ భావమిత్రతా
స్తోమములఁ జెందిరింక జగతిన్ గల వే యుపమింప వస్తువుల్.

గీ॥ దానసౌందర్యముల మహోదారుఁడైన
ఘనుఁడు మదనాభిరాముండు గాంచినంత
జారు సుకవుల కష్టంబు, శత్రుశస్త్రి
మంగనల నీవులును చిత్ర మగును పొగడ.

కం॥ మదనాభి రాముఁడమ్ముల
పొంచి వాడి శరంబుఁ దీయఁబూనిన వింటం
గుదిరిచిన నిండ లాగినఁ
గదలదు మృగిఁగూడి మృగము కాముఁడటంచున్.

గీ॥ రసవిచిత్రంబు మదనాభి రామ నృప ఘ
న ప్రతాపాగ్ని భూభృదౌన్నత్యకటక

ములఁ జరించిన శత్రురాజులగృహంబు
లందు జనియించుఁ దృణసమూహంబు పెలుచ.

కం॥ ఆ రాజచంద్రునకు భా
ర్యారత్నము కల్పవల్లి యన సౌందర్య
శ్రీరత్నాకర వేలా
ధోరణి రాజిల్లెఁ గామధుక్ప్రస్తుత యై

గీ॥ వాంఛలలరింప నాకల్పవల్లి యైన
కల్పవల్లిని గలసి సంకల్పితేష్ట
కామతంత్రము మదనాభిరామ నృపతి
నెఱపి కనియెను నొక్కకన్నియను వేడ్క.

గీ॥ పుణ్యదినమున యామినీపూర్ణ తిలక
యనెడు నామంబు నితరులా యమకునిడిరి
అంత బాలిక నిత్యంబు వింతకాంతిఁ
(గ్రాలుచున్)మించెఁ జంద్రుని కళయనంగ.

కం॥ మిన్నగ నిగ్గులుమించిన
కన్నియకున్ శైశవంబు కడచనియెను మే
ల్వెన్నెలలుగప్ప రాత్రిం
బన్నిన చీకటి వొలంగుపగిది౦దోపన్.

చ॥ కలువలమించెఁగన్నుఁగవ కంఠముశంఖ జయంబుగాంచెఁ జ
న్నులు లికుచంబులందఱిమెనుద్దుల వోయుదలంచెఁ దప్పిబా

క్కిలిభ్రమ నిగ్గుగాదనియెఁ గేల్జిగిపల్లవ పంక్తి జగ్గఁదా
తలమసియెన్ రథచ్ఛదముదాఁ బెను కెంపులఁబోటికిన్ త్రిజే

ఆ॥వె॥ చెలియముద్దు ముఖము కళ దిక్కరాయని
వే జయింపఁబూన వేఁడుకొనఁగ
వచ్చి పదములంటువాఱితె నో చుక్కల
నంగఁదనరె చరణ నఖచయంబు.

సీ॥ సమణికాంచన ఘల్లులా చరణహంస
కాబ్జమణిపృణి (యగు. చెలి యంఘ్రియుగళి
కలకలనుబల్కు సంచలఁగలసి మెలఁగు
గక్త పద్మద్వయంబన రమ్యమయ్యె.

సీ॥ రమణియను రాజ్యమునవలరాజు జేరి
నంతటను హంసకములను హంసభృత్యు
లచట నిల్పిన కనకకాహాళములనఁగ
జగ్గగులునుచుఁ జెలిముద్దు జంఘలమరె.

గీ॥ ధళధళనిజాలువా నిగ్గువాఁళుకు చెలియ
తొడలు చెలువొందె మదనుని తోఁట నడుమఁ
కప్పురపు పాములను సుధ తెప్పదేల
కట్టఁబెరగిన బాగారు కదళులనఁగ.

గీ॥ రత్నకాంచన కాంచివిరాజితముగు
వెలఁదిచొక్కపుఁగటి పువ్వు వింటిదొరకు

హోమమయధాళ ధళ రత్నధామ జాల
లాలితంబగు స్థలదుర్గలక్ష్మిఁగూర్చె.

సీ॥ కొత్తగావచ్చి విషమాంబకుఁడను రాజు
చెలియయౌను పట్టణముఁ బ్రవేశించునపుడు
కానవచ్చిన నేమేమి యౌనొయనుచుఁ
దెరలెనోయన మధ్యంబదృశ్యమయ్యె.

కం॥ చెలి యౌవనవనమధ్య
స్థలమునఁబూవింటిరాజు జలకేళులకై
జలజభవుండొనరించిన
కొలనన సతి నాభి ముద్దు గులుకుచు నొప్పెన్.

కం॥ బలసిన గుబ్బలనలఁదిన
గళితపుఁ గస్తూరి చన్నుఁ గవ యొరసిన మి
క్కిలి చాలుగఁ గ్రొలెనో యన
కలికి చొకాటంపు టూరుకాంతంబయ్యెన్.

ఉ॥ పొక్కిలిబోదెయందు పరిపూర్ణముగాసుధయుండునంచుఁదా
చొక్కపురోమ రాజియను సూత్రిము చేతను చేదినింపఁ బెం
పెక్కిన మేలిపిందియల పొచ్చుగనుం చెనొ యౌవనంబుసన్
మిక్కిలిదోచులక్ష్మియన మేలగు చన్గవ యొప్పెఁగాంతకున్

కం॥ గళము త్రిరేఖాంకితమై
వెలసెను శంఖంబనంగ విమలాంగికి; క

ల్పలతికలన బాహువులు
జ్వలమణిభూషణ విలసన సంపదఁబూనెన్.

గీ॥ నలువ బంగారుతమ్మిమొగ్గలను చెలియ
చన్నుగవఁజేసి వికసన సంశయమున
పూర్ణచంద్రుని మీఁద పెంపుగను నిలిపె
ననఁగఁ దరళాక్షి రమ్యముఖాబ్జములరె.

గీ॥ తరుణి మృదుమధురారుణాధరముతోడ
సమముసేయంగవచ్చు విద్రుమము సుధయు
బంధుజీవక మొక్కటభాసమాన
తామరసమున నుక్కని దాల్చెనేని.

కం॥ చెలికాఁడగు చంద్రుండా
చెలిచొక్కపువదన లక్ష్మిఁజెందగఁ గలువల్
నిలచెనో తత్పాపద నస
నలిచికురకు నలరెఁగన్ను లందములగుచున్.

ఉ॥ ఈరమణీ మణీ మణికి నీడు జగత్త్రితయంబు లోపలన్
రారుసుమా మనోజ్ఞ గుణరాజిని రాముల నెంచనంచు నా
వారిజ గర్భుఁడామెతల వ్రాయుచు నాద్యవసాన సీను శ్రీ
కారములుంచెనో యనఁగఁ గామినికర్ణయుగంబు భాసిలెన్.

ఉ॥ సారసపత్రి నేత్రయను చారుపురంబును జేరి మన్మథ
స్మారమణుండు కిస్తురిని జాదినకమ్మవితావులీనుమే

ల్ప్రిరుకమానుజోడుపొది(దీసియటుంచెనో కో యనంగ) జె
న్నారెను కాంత కన్బొమలు నందపునాసికయద్భుతంబుగన్

గీ॥ మహితకచభారనీరద మండలంబు
వలన గిళరాజ శంఖంబు నందు వెడలి
చాలుగానిల్చి యున్న ముత్యాలనంగ
కాంతకొప్పారె రదన రేఖాద్వయంబు.

కం॥ నీలపుఁగునుకల దగ దగ
డాలునటుండుండుమను మిటారి కురులు; నై
వాలము సుంతయుడీకొనఁ
జాలదు పో యుత్తమాంగ జములగుకతనన్.

సీ॥ చెక్కని నెమ్మోము చంద్రకాంతంబందు
నెఱెగుల్కు కురులింద్ర నీలమణులు
సొంపగు కెమ్మోవిచొక్క మౌ బల్కెంపు
కరములు పద్మరాగములు నఖర
ములుగొప్ప సిద్ధంపు ముత్యముల్ చక చక
మను దంతములు వజ్రమణులు చరణ
యుగళంబు జోడైన పగడంబు ధళ ధళ
ధళమను మేను కుందనము చెలికి

గీ॥ (అహహా! మజ్జారె! జవ్వనమనెడి) జాళు
వాపసిండిని చెలువు మవ్వంబుమీఱ

బమ్మ చేసిన రత్నంపు బొమ్మయనఁగఁ
జూపరులు మెచ్చ నలరె నా సుందరాంగి.

కం॥ నిండారు జవ్వనము మెయి
నిండని మునుపే మృగాక్షి నిత్యము శిక్షా
పాండితి గీత విశేషా
ఖండపటిమఁబూని చెలఁగెఁ గడుఁజిత్రముగన్.

మ॥ రమణీ మన్మథ! మన్మథాహిత (రమాప్రారంభ! రంభావిటో
పమసౌందర్యనిదాన!) దాన గుణ శోభా భాసమానాసమా
న మదేభాశ్రిత వాస! వాసవసమాన స్ఫారసద్భోగ భా
గ్యమహానాయక చంద్ర! చంద్రశర ముక్తాకీర్తి భూషోజ్వలా.

కం॥ పరమద దంతావళకే
(సరి విక్రమ! తనుజితాంగజా యుగదవి)
స్ఫురదంగ రామణీయక
సరసమధుర వాగ్విలాస చంచత్ స్థానా.

మా॥ నిరతమధుర మూర్తీ నిర్మలస్ఫారకీర్తీ
పరమదపరిహారీ! పాలితాశేషసూరీ!
నిరుపమ సుచరిత్రా! నిత్యసర్వత్ర జైత్రా
సురుచిర గుణజాలా సుందరీబృందహేలా.

గద్య. ఇది శ్రీమదరవింద నాభపదారవింద మిళిందాయమాన
మానస భారద్వాజ పవిత్రగోత్ర చెన్నూరు
రామచంద్రకవీంద్ర పుత్రాంధ్ర గీర్వాణ
భాషాకవితా సుమనోద్రిశోభనాద్రి ప్రణీ
తంబైన శృంగార సుధాసముద్ర
పూర్ణచంద్రోదయంబను
మహా ప్రబంధంబునందు
ప్రథమాశ్వాసము.

మంగళము.

శ్రీ శుభమస్తు

# శృంగారసుధాసముద్రపూర్ణచంద్రోదయము.

ద్వితీయాశ్వాసము.

కం॥ శ్రీవర పదాబ్జ భక్తి
శ్రీవిలసిత హృదయ (సమద రిపుశిక్షోద
క్షా!) వందిత గుణగణ స
ద్భావాశ్రిత గుమ్మడంపు పాపయ్యనృపా.

వ॥ అవధరింపుము

కం॥ ఆనంద నిధానం బై
యానందన చంద్రరేఖ యనువుగ
దైనందినమున్ ముదమును
బూనుచు మదనాభిరామ భూపతి యొప్పెన్.

వ॥ అంత నొక్కనాడఖండవైభవ ఖండితాఖండల విభవపాం
డిత్యుండును, పాండిత్య నైశిత్యదండిత కుండలీశ్వరుండును, ఈశ్వ
రారవింద జాత బృందారక వందారు బృందవందిత సుందరార

విందనాభ పదారవింద వందనతుందిల మరందబిందు సందోహ నందదిందింది రాయమాన మానసుండును, అసమాన జైత్రయాత్రా కాలిక రథకరటి ఘటాఘోటక భట నిరాఘాట ధాటి ఘట్టనోద్ధూత ధరాపరాగపిహిత దినకర ప్రివర్ధమాన సంతమస హరణచణ వజ్రమౌక్తిక దేదీప్యమాన శారద రాకాచంద్రాయిత నిజశ్వేతాత పత్రప్రభా కౌముదీముదిత బాంధవ మిత్రజీవంజీవా కుంభ కరటి కంఠ ఘంటా ఘణం ఘణం ఘణం ఘణ శింజానకింకిణీ గణ గణ క్వణన భృంహిత నిస్సాణ ధణం ధణం ధణ ఘన ఘనాఘన గర్జిత నిర్జిత సకల దేశాధికరణా ధిక్కరణ రాజహంసుండును, హంసనందనాధిక దానసకల విద్వత్కవిగాయకాది రక్షా దీక్షా దక్ష కరుణాకటాక్ష వీక్షణుండును, ధరణీసురాశీర్వాద వర్ధిత పుత్రపౌత్ర పూజ్యప్రాజ్య సామ్రాజ్యుండును, కామినీమణీ నయన చకోర చంద్రాయిత సుందరదేహ మదనాభిరాముండగు మదనాభి రామచంద్రుండు ప్రత్యూషంబున భేరీ మృదంగాది నినదంబుల వందిమాగధ జయ జయా రావంబుల వీణానినాదంబుల, మేలుకాంచి, శ్రీ మదన గోపాల చరణధ్యాన పరాయణుండై లేచి, మణిదర్పణాది దర్శనంబుజేసి, గుంపులు గుంపులుగా సొంపులు నింపు కెంపుల పావాలుదొడిగి, క్రీడామందిరంబువెడలి, మెడ నెడ జడ యానలు గడగడ గుబ్బలబెడంగునను వడకుకొను లొయ్యారంబులొడ గూర్పకై దండలొసగ జనుదెంచి మజ్జన గృహంబున కలకల నవ్వు మొగంపు చిలుకల కొలుకుల

గిల్కు లందియల ఘల్లలు కంకణ ఝణం ఝణారవంబులు నేకీభవింప, రతనాల కుందనపుఁ జెంబుల నఖింపచంబగు పన్నీరంది మజ్జనం బాచరించి, సాలంకార చతుష్టయుండై వెడలి భద్రదంతావళము నెక్కి, ధవళాత పత్రంబు డంబువహింప, సొంపులుగుల్కు పగడపు స్తంభంబులును, హెచ్చైన మేల్పచ్చల పచ్చతోరణంబులును, మరకతమణి కుట్టిమంబులును వజ్రకీలిత కవాటంబులును, నీలనీల సోపానంబులును, పద్మరాగపతద్దికలును, ముక్తామణి వితాన వితానంబులును; వైడూర్య ధగ ధగాయమాన కనకసాలభంజికలును, సభాంతరంబవలనుండునోయని భ్రమియింపం జేయు నిలువుటద్దంపు గోడలును, నిగన్నిగాయ మానంబులై సొంపులు గ్రుమ్మరింపఁ బుణ్యజనాధారంబై విబుధసేవితంబగుచు మణిగర్భితంబై రత్నాకరంబు ననుకరింపుచు సుమనోమనోహరంబై, సుధర్మ యనంబరగి, యొప్పుకొలువు కూటంబుఁ జేరి, మణిమయహిరణ్మ సింహాసనంబునఁ గూర్చుండి, ఫళ ఫళమను పైతిని దారులు, పున్నమ వెన్నెలలుగాయ నిండ నీలశృంగ సంగత కురంగధర పూర్ణ బింబంబుదయరక్తిమ రక్తంబైన తెలుఁగున సొంపగు కెంపుల తురాయి జగా కెంజాయఁగప్పి సొబంగుమీఱు ధవళోష్ణీషంబు శిరంబున జగ్గుగులుక రాజమార్తాండుండు గావున బంగారుజకీ కెంబట్టు దుప్పటి లేత ముద్దుటెండగాయ భూపాలచంద్రుండు గావున ఘుమం ఘుమం ఘుమం ఘుమాయమాన కర్పూర చందనంబు చికిలి వెన్నెల నిగ్గులనీన, గస్తూరితిలకాలంకృతంబైన సమ్మోము

కదలని గండుతుమ్మెద వడువున నమము బెడంగుంబూనఁ గట్టాణి ముత్యంబులు యొంటలు ముఖచంద్రుని సేవింప చిత్తా స్వాతి తారలు నిరుదెరంగుల రంగులుగులుక నిలచెనోయన, పెంపు వహింప, గళంబున ధగద్ధగాయమాన మణిఖచిత కనకమయంబగు పతకంబు మెరయ; చొక్కమైన ముద్దుమొగమూత్మోలి జోలి కొరగి రాజకందర్పుండౌట లీలారవిందంబు నొక్క కెంగేలఁగీలించి సాఖిశాయిసిక సౌవస్తిక, బుధనామసచివ సుకవిగాయక వైణిక వాంశిక మార్దంగికనికరంబు నిజ విద్యావివాదంబు లొన గింప వందిమాగధ రాజ సనాతనాధునా తన రాజనిదానదాక్షిణ్య శౌర్య గాంభీర్య బిరుదహృద్యాన పద్యగద్య పద్యంబులు ప్రస్తు తింప కనక మాణిక్య చాకచక్య ఘల్లు లాచరణ మంజుమంజీరవై వారకాంజాక్షులు నర్తనంబులుసలుప నొయ్యారంబుగా పయ్యెద యొరపైన గబ్బిగుబ్బలవిడిబడు కుందనపు మేల్ డాలు చూపరుల చూపుల నాప ముద్దులుగుమ్మరించు ముద్దుగుమ్మలు కపురపు బాగా లొసంగి వాలారు గోరుల కెంజాయ లేమావి కొంజిగురుటాకు మడుపులవలెనుండు తెలనాకు మడుపులొసంగఁ గంకణ ఝణం ఝణ రవణంబుగా నిద్దరు ముద్దియలు చామరంబులుబూని వీవ మాణిగంపు బుడుతలు కెంపులరవల్లల పటికంపు పన్నీరు గిండి కపురపురపు సురటిచొకాటంపు తెరువారు రతనాల పిడిచూరిపన్మ రాగములుదాపిన నీలాలడాలుబూని చెంగటసిలువ వింధ్యమాఁకి డినచందంబున, జగన్మోహనుండైన మన్మథ మహారాజు గొలు

పుండుశేవ విలసిల్లుచుండి చంద్రశేఖరుండను మంత్రిశేఖరుం
గనుంగొని సవిలాసంబుగా నిట్లనియె.

గీ॥ యామినీ పూర్ణతిలకకు యౌవనంబు
పూర్ణమయ్యెను; మును పె యా పువ్వుబోడి
సకల సంగీత విద్యావిశారదయయి
పెరిగె సాహిత్యమింకఁ జెప్పింపవలయు.

కం॥ సంగీతమునకు భూషణ
మంగన చదువంగవలయు, నఖిల విబుధలో
కాంగీకృత రసవత్సా
ర్వాంగము లివి నాకు ముఖ్యమగు వాంఛ మదిన్.

కం॥ దీనికి నెద్ది యుపాయము
బూనగ వలయునొ? విశేషబుద్ధివి విద్వ
న్మానితుఁడవు నీవుగదా
నీ నేర్పునఁ జెప్పు కార్య నిశ్చయసరణిన్.

కం॥ అనఁజంద్రశేఖరుఁడు రా
జున కనియెన్ దేవ యాదియ చొక్కపుఁబని; యీ
ఘన విద్వద్రత్నంబులు
నిను నిత్యము గొల్చియుండ నేర్పుఁగ లేరే?

కం॥ అనిన మదనాభిరాముఁడు
మనమున నుప్పొంగి కార్యమగ్నుండై స

జ్జనవరులకీ ప్రయోజన
మనువుపడగఁదెలియఁబలుకు మనవినియంతన్.

వ॥ విని చంద్రశేఖరుండు విబుధమండలంబు నుద్దేశించి యిట్లను:- పండితాఖండలులారా, రాజచంద్రుండగు మదనాభిరాముండు తన యనుంగు కూతురగు యామినీ పూర్ణతిలకయను కన్యారత్నంబునకుఁ గావ్యనాటకాలంకార శృంగార కళావిలాస విశారదత్వంబు నాపాదింప నూహించె. ఇదియే యాశాస్యంబు గదా? మీయందొక్కరీ కార్యావలంబనంబు సేయవలయు. మహారాజానుజ్ఞఁదదాశ్రితులగు వారి కాశ్రయణీయంబుగదాయని యుచిత రీతిని వక్కాణించిన వారలిట్లనిరి.

సీ॥ తర్కశాస్త్రోక్తరాద్ధాంత సిద్ధాంత స
చారుఁడననియె మయూరశాస్త్రి
శబ్దశాస్త్రవిచార సర్వాంకషుండనే
ననిపల్కె శాబ్దికేంద్రాఖ్యశాస్త్రి
పూర్వమీమాంసాప్రభూత పాండితినాకుఁ
గలదని నొడివె నిష్కంపశాస్త్రి
వేదాంత జలరాశి వేలాయితాత్ముఁడ
ననిపల్కె నపర ఫాలాక్షశాస్త్రి

గీ॥ సాంఖ్యమత వేది ననియె విజ్ఞానశాస్త్రి
యోగ మెరుఁగుదు ననియెను నాగశాస్త్రి

రత్నగజహయశాస్త్ర పారంగ తుండ
నని యెనప్పుడు ప్రళయకాలాగ్నిశాస్త్రి.

కం॥ మిగిలిన శాస్త్రి సమూహము
తగబల్కెను నైజశాస్త్ర ఘోరేంగిత యు
న్నగతి; యపుడని యె మంత్రికి
జగదీశ్వరశాస్త్రి వాక్య సారస్యమునన్.

వ॥ చంద్రశేఖర మంత్రిశేఖరా యీ లక్ష్మీనివాసరాజధాని యందు కావ్యనాటకాలంకార కళాశాస్త్రాది కళాధురంధరులగు బిల్హణ, మల్హణులను కవిరాజ శిరోమణులు గలరు. వారిరువుర యందు బిల్హణుండసాధారణ పాండితీశౌండుండు.

సీ॥ సకలర్తువులలో వసంత ఋతువురీతిం
పూవులలో మల్లెపూవు రీతి
విలుకాండ్రలోం దియ్య విలుకానిపగిదిని
కుంతంబులను గరుత్మంతుకరణి
గ్రహములలోన భాస్కరుని చాడ్పున మహా,
నదులలోపలవియన్నదివిధాన
నగములలోపల నగరాజు పోలుపున
రసముల శృంగార రసము భాతి

గీ॥ దేవతావళిలో మహా దేవుసరణి
శాస్త్రములయందు వేదాంత శాస్త్రమట్లు

సకల భాషాకవీశ్వర సంఘమందు
పరివిమలాత్ముండు బిల్హణకవి యొప్పున్.

కం॥ అతండనవ్వహంబుం గావ్యా
మృతతత్పరత శిష్యసస్య మిగ్రోయుచు స్వాం
త్రత జీవించుచు క్షితిపుల
స్తుతిసేయంగ బోడు గుణవిశుద్ధుండగుటన్.

కం॥ వినుబిల్హణ కవిచంద్రుండు
ఘనమతి సత్కావ్యశిక్షుం గావింపంగలం
డని చెప్పిన రాజాజ్ఞం
గొని పిలిపించిన నతం డకుంఠితరీతిన్.

కం॥ చనుదెంచి బిల్హణుండా
జనపతిం గని యుచితగతి సరసఫలౌఘా
భినవ శుభాక్షత లొప్పంగం
గొని తదభిముఖత్వమూని కుతుకముతోడన్.

గీ॥ విశ్వమదనాభిరామ సర్వేశ్వరస్స
దా దదాతు సుపుత్రపౌత్రప్రకృష్ట
రాజ్య సంపద్భరాన్ తే నిరంతరం ర
మాపయోధరనవ కుంకుమస్ఫుటశ్శ్రీః !

మ॥ అని యాశీర్వచనంబుచేసిన నృపాలాగ్రేసరుండా కవిం
ద్రుని కర్హాసన మీయంబంచి యని మోదోద్రేక, నాభాగ్యమే

మనమిమ్ముఁ గనఁ గోంటి. మీరనఁగఁ బద్మాక్షావతారంబు; నా జననంబింకిట సార్థ మయ్యెనఁగదా సాహిత్యవాచస్పతీ.

శా॥ మీరీపట్టణమందె యుండియును నా మీఁదంగృపాదృష్టియే
పారన్ దర్శన మీయకుండుట దయాప్రావణ్యగణ్యాంబె? యు
య్యారే (నామరదృష్ట మింతకు బలీయంబందు నేడేన్)దయా
పారావార భవత్పదాంబురుహ సేవంజేయ నేఁగోరెదన్.

గీ॥ అనుచు వినయంబుతో మద నాభిరాముఁ
డనిన బిల్హణుండనియె నో జనవరేణ్య!
వినుము విద్యావిశేష వివేచనమున
నింతకాలబు గడపితి నిప్పురమున.

కం॥ అరయుచు నిత్యము నరపతి
ధరరక్షించినను హెచ్చుఁదత్త్వజ్ఞా
చరణీయకృత్యములు భూ
సురు లితరాశ్రియముసేయ జొరరు నరేంద్రా.

ఉ॥ యో మదనాభిరామ నర పోత్తమ! శాత్రివశస్త్రమేఘుర్ఘం
ఘూమరు దుర్ధతిన్ దనరఁజాలి తలత్తలకాంతిచే జయ
శ్రీమహితత్వమొందిన గరిష్ఠ భవత్పటు ఖడ్గధారయే
భూమిసురాళిఁ బ్రోచునని భూపతి నిల్చెనుగాదె నిత్యమున్.

కం॥ అని బిల్హణుండు బలికిన
విని తా మదనాభిరామ విశ్వాధరేంద్రుం

డనియెన్ మత్కన్యామణి
ఘనకావ్యములందు శిక్షఁ గావింపవలెన్.
అని రాజుబల్క బిల్హణుఁ
డనియెన్ ముదమంది దేవ యట్టులె యగుఁబో
విను నీ యనుమతి చొప్పున
నొనరించెదననిన నృపతి యుప్పొంగిమదిన్.

వ॥ తదనంతరంబున సబహుమానంబుగా జాంబూనద దాంబరా
ణా వారణపల్యంకి కాగ్రిహారాదికంబొసంగి నిజ నివాసంబునకు
ణుంబంచి సభ్యుల వీడు కొలపి చంద్రశేఖరుండును దానును
ొక్క యేకాంతస్థలంబున పూజవికెయందు సుఖంబుననుండి
త్రినిగాంచి యిట్లనియె.

చక్కనివాఁడు మాటలకు జాణ కళాగమ సాహితీ చణుం
డక్కట బిల్హణుండితని యందముఁజూచిన మందయాన ల
మ్మక్కయటంచు భర్తలనుమాని పయింబడవచ్చి నిచ్చలున్
జొక్కకయుందురే రతులఁ? జొప్పగునే మనకీతఁడుండినన్.

ధర కల్పవృక్షమనఁగా
బరగిన బిల్హణుని దేహ భాసురశోభా
నిరుపమ సుమమంజరి సుం
దరుల మనోభృంగములను తనపై నిల్పున్.

కావున కన్యకామణికిఁ గట్టెదుటం గవిసల్పనేని వి
ద్యావివిధ పరికారముల నభ్యసనంబు పొసంగు కెట్లహం

గీ॥ చంద్రశేఖర యిక్కార్య సరణికిట్టి
సంధియముబుట్టెగాన నిశ్చయముఁజెప్పు
మనిన నతఁడిట్టులనియెనో జనవరేణ్య
ఈవెఱుంగని సరణి యెందేని గలదె.

గీ॥ అయిన నొకయుక్తిగలదు బిల్హణుఁడు కుష్ఠ
బాధితులఁ జూడనని మున్ను వ్రతముఁబూనె
కన్యకారత్నమంధులఁ గన నటంచు
ప్రతిన జేసెను మదనాభి రామచంద్ర.

కం॥ (ఇది మున్నే వింటిరి నె
మ్మది నీవ్రతసరణిరా కుమారికిఁ గవికిన్
విదితంబుగ నిగదించిన
పిదపన్ మన కోరిక నెఱవేఱకయున్నే?.)

కం॥ శిక్షాకాలంబునను మృ
గాక్షికి నధ్యాపకునకు నడ్డముగా మ
ధ్యక్షితిఁ దెరగట్టించిన
రక్షితమయిఁ కన్య చదువు (రాజలలామా.)

కం॥ అనిచంద్ర శేఖరుఁడు బ
ల్కిన విని యిదియుక్తమనుచు క్షితిపతి తననం

దన వేగబిలువఁ గంచుకి
జనము నియోగించె వచ్చెఁ జంద్రానన యుక్.;

చ॥ మెఱుపుల గుంపు నిల్కడను మొందుగఁ బూనుచు జగ్గు గుల్కఁగా
సరసిజ సంభవుండు యువసంఘముపైన శరీర భావనున్
మురువుగ గల్గువట్టులుగ మోహనవిద్యను జేసెనో క్రొ? య
బ్బురమని చూపరుల్ వెరగుబొందగఁ గన్యక వచ్చె హెచ్చుగన్

సీ॥ క్రొక్కారు మెఱుఁగులు గుంపైయి నిల్చెనో
యను కుందనపుమేను నునుపుమీఱ
గబ్బి సిబ్బెపు గుబ్బ కవ యుబ్బుకు గడ
గడ కౌనువడఁకుచు బెడఁగుఁబూన
క్రల కల మను నెమ్మొగంపుఁజందుర్ని కాంతి
జననేత్ర కుముదముల్ జగ్గుగులుక
ఘులు ఘల్లు మను హంసకంబుల మ్రోతకుఁ
బెంపుటంచలు కాళ్ళఁ బెనఁగుచుండ.

గీ॥ ముద్దు గుల్కుచు నుండెడి ముద్దుగుమ్మ
లిరుగడల నిల్చికై దండ లిచ్చుచుండ
గంధకస్తూరి మాలికల్ ఘుమ్మురనగ
ముదముతో వచ్చె యామినీ పూర్ణతిలక.

కం॥ అయ్యెడఁ జరణంబులపైఁ
దాయ్యాలి శిరమూని మ్రొక్కఁ దోడనె వేడ్కన్



26700
24-6-72

నెయ్యమున నెత్తి దీవన
లయ్య యొసఁగెఁ గూఁతునకు మహాభ్యుదయముగన్.

వ॥ దీవనలొసంగి ప్రియమున శిరసు మూర్కొని నివు రుచు చిన్నిపట్టి నన్నుఁ గన్నమ్మ, సత్కావ్య నాటకాది లలిత సాహిత్య శిక్షావిలాసమిపుడు నీకొనరింపఁ దలంచినాఁడ, నిప్పట్టణంబున బిల్హణకవి చంద్రుండు గలండతండు కావ్యనాటకాలంకార శృంగార కళాశాస్త్రాది విశారదుండు, సంగీత విద్యానవద్యవగు నీకు హృద్యంబగు సాహిత్య సౌహిత్యంబు కుసుమంబునకు పరిమళంబువగిది భూషణంబగుఁ గాదె, మైననొక్కటి గల దతండంధుండు నీవు నయనహీనుల నవలోకింపవు గదా, యటు గావున తెఱమఱుగున నిలచి యభ్యసింపుచునవుడు, కన్నియ యట్టులె కానిమ్మని తదనుజ్ఞఁ గొని నమస్కరించి యంతిపురంబునకుఁ జనియె నంత మదనాభిరామచంద్రుండు)

కం॥ (సంతోషంబున బిల్హణు
చెంతకుఁ దగుజనులఁబంపె; శీఘ్రంబుగ) నీ
మంతుఁ డతండరుదెర సి
జాంతికమునను నిచి పూజ లందించితగన్.

మ॥ కవిచంద్రా మునువిన్నవించితిఁ గదా కన్యామణిశిక్షకై;
నవపద్మాననమైన యాబిడకు మేనంకుష్ఠరోగంబాగిన్
దవిలెన్ మున్నటినుండియక్కతననిత్యంబున్ మిముంగొల్వమే
లవునో కాదో వచింపగా వెఱతు నుద్యచ్ఛాంకితాత్ముండనై

కం॥ అని బిల్హణుండు కుష్ఠులఁ
గననే కటుగాన వడుమఁ గల్పింపఁదగున్
వనజాక్షికి మాకుదు తెఱ;
యన రాజది లెస్సయనియె హర్షాన్వితుఁడై.

వ॥ తదనంతరంబున నుచిత సత్కారంబున బిల్హణు వీడు కొలిపి యమ్మహీమండలా ఖండలుండు కార్తాంతిక నిర్వర్తిత శుభముహూర్తంబున స్వస్తి పుణ్యాహవాచన పూర్వకంబుగాఁ గన్యకా మణికి మంగళ స్నానాలంకారదికం బొనరింపఁజేసి చిరత్న సూత్ను కనక ఖచితంబైన శాలాంతరంబున మహార్హ్వ తిరస్కరణి ఘట్టించి యవ్వల కన్యకనునిచి, బిల్హణురావించి శుభముహూర్తంబున వాగ్దేవతార్చనంబాచరింపించి, యతనికి ననర్ఘ్యమణి కనక హారాదులఁ బూజయొనరించి, సకల శ్రుతిమనోహరంబై యాది కావ్యంబగు శ్రీమద్రామాయణశ్లోకరత్నంబుపక్రమింపఁజేయించి, గో, భూమి, వస్త్ర కాంచనాది దానంబుల సకల విబుధయాచకుల సంతృప్తులంజేసె. అనంతరంబు యామినీ పూర్ణతిలకయు నిరంతరంబు విద్యాభ్యాసంబు సేయుచు నానందంబుగా విలసిల్లె నంత.

కం॥ భువకవి చంద్రుండగు బి
ల్హణుఁడా కన్యకకు సర్వలక్షణ లక్ష్యం

బనఁజను శ్రీరామాయణ
మనువుపడగఁ జెప్పెనంతయు వేడ్కన్.

గీ॥ కావ్యనాటక శృంగార కావ్యమదన
శాస్త్రమర్మంబులన్నియు సంతతంబు
జెప్పుచును ప్రౌఢగాఁజేసె జెలియ నతఁడు
రాజుసానందుఁడై తన్ను పూజసేయ.

శా॥ లోకాలోక ధరాధరా న్వితధరాలోలచ్ఛ కోరీ బుభు
క్షాకోకీవిరహార్తి హారకలసచ్చంద్రాతపద్యోమణీ
శ్రీకళ్యాణయశః ప్రతాప శుభగక్షేమంకరప్రాభవా
స్తోకస్ఫీత భుజాబలాగ్ని భవ బంధు స్వర్గరీతిమహా.

కం॥ పురహార విక్రమ శాత్రవ
పురహార శరశారదాభ్ర భోగీంద్ర యశో
త్కర కరవాలహృత భయం
కరశాత్రవరాజహంస ఘననృపతంసా.

సువర్ణశైల ధీరధీర శోభనోక్తి సంస్తుతా
కవీంద్ర భూరి భూరిదాన కల్పకకుమారు హా
నరప్రభూత భూతనాథ నానటద్యశోధరా
దవానలారివారివారిద ప్రకాండ కార్ముకా.

గద్య. ఇది శ్రీమదరవిందనాభ పదారవింద మిళిందాయమాన
మానస భారద్వాజ పవిత్రగోత్ర చెన్నూరు
రామచంద్రకవీంద్ర పుత్రాంధ్ర గీర్వాణ
భాషాకవితా సుమనోద్రిశోభనాద్రి ప్రణీ
తంబైన శృంగార సుధా సముద్ర
పూర్ణ చంద్రోదయంబను
మహా ప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.

మంగళము.

శ్రీ శుభమస్తు

# శృంగారసుధాసముద్రపూర్ణచంద్రోదయము.

## తృతీయాశ్వాసము.

కం॥ శ్రీరాజిత షోడశ దా
నారూఢ కళాప్రవీణ యభినవ తేజ
స్స్ఫుర దిగంతయశస్సం
భారా శ్రీ గుమ్మడంపు పాపయ్య నృపా.

వ॥ అవధరింపుము

కం॥ అంతటఁ గాంతారత్నము
సంతతమును మదన శాస్త్రసారస్య సుధన్
స్వాంతమునఁ గ్రోలుచుండన
నంతదినములరుగుచుండె నంతకొకనిశిన్.

వ॥ మహనీయ తపనీయభిత్తిభాగ వజ్రమణిగణంబులును, నొప్పైన గొప్ప పవడంపు స్తంభంబులును అచ్చంపు గరుడప పచ్చల కాంతి విలేపనంబులును, ముత్యాలమ్రుగ్గులును, ముగ్గులు

గులుకు గొప్ప నించుటద్దంబులును, కెంపుల కోళ్లను, పచ్చ పట్టెలను నొప్పెడు హంసతూలికా తల్పంబులును, మణిప్రభాప్ర దీపంబులును పరిచారికా కార్యంబు లొనరించు చిత్రింపు బొమ్మ లును, కుందనపుం గాన పాత్రికలును. శారికా కీరికా పంజరంబు లును, బంధరతిరమమాణ రమణీ రమణాంచితంబులగు చిత్తరువు లును,కనక తాంబూల పేటికలును, సువర్ణకలాచికలును వివిధ మ ధుర ఖాద్యోపాహారంబులును, కల్గి క్రీడామందిరంబు ననుకరించు విద్యా మంటపంబునం దెలిమఱుగునం బురుషాయితాది రతి రహస్య గ్రంథంబు గంధగజయాన చింతనసేయుచుండ, నివ్వల బిల్వాణుండగ్వాసనంబున నున్న సమయంబున నున్నతంబుగాం జంద్రోదయంబైన, నేకాంతంబున కాంతామణి సన్నిహితుండు గావునం బంచశరశర పీడితుండై విహారదయంబు వర్ణింపం దొడంగె నదియెట్టిదనిన.

సీ॥ మారనారాచ నిర్మాణ శాణమనంగ
యామినీ కామినీ రామమత్త
వేదండ ధళ ధళ ద్విమల దంతాంచిత
ఖండసన్మిత కర్ణ కుండలమనం
ప్రాగ్వధూటీకర భాసమానవిలాస
ఫుల్లాభి నవసితాంభోజ మనంగం
విరహ బాధాభినివేశ నిర్వృత్పుష్ప
పత్రికు ముక్తాత పత్రమనగం

గీ॥ కుముద భేదన మదనార్త సముదయాంగ
దళన తిమిర నివారణ తపనతాప
హారణ సరసిజ ముకుళన కరణమైన
సితకిరణ బింబ ముదయించెఁ జెలువుదోప.

చం॥ కలువల నవ్వఁజేయుచును కాములనంగ్రుళి యుంపఁజేయుచున్
జలనిధిఁబొంగఁజేయుచును చంద్రికలన్ వికసింపజేయుచున్
లలిత సరోజపాళులకు లక్ష్మిని బాపుచుఁ జక్రవాకపం
క్తులభయమొంద జేయు మవిధుండుదయించెనుతూర్పుదిక్కునన్

ఉ॥ చీకటి గుంపులందొలఁగఁజేయుచు నిద్దపుఁబాఁడు వెన్నెలన్
కోకములార్తినొందగఁ జకోరములన్ రమియింపఁజేయుచున్
చాకచకీ ప్రభాకలిత చంద్రమణీ శిలలన్ సితాంబువుల్
జోకసృజింపుచున్ విధుఁడుచోద్యముగానుదయించెమూర్పునన్.

కం॥ రవి దోషాగమనము తా
నవిరళగతిఁ గాంచిచనియె, నక్కట శశివే
దివి నుదయమందె నట్టులె
భువిని కళంకికిని శంక బొడమునెమదిలోన్.

గీ॥ గగనమను వాపియందు చొక్కాటమైన
పుండరీకంబొ యిసియనఁ బొంకమైన
మారనారాచశాణ సపదలుదాల్చు
చంద్రబింబంబు తూర్పున జగ్గుజూనె.

గీ॥ గగనమంబుధి, నురుగు రిక్కలు, చోకాట
మైనఁదెలి దమ్మి శశి, తదభ్యంతరమునఁ
జూడనొప్పెడి సీలిమ చొక్కమైన
గండుతుమ్మెద యన వింత కాంతిఁబూనె.

గీ॥ ఆకసంబను శాణంబు నందు చొక్క
మైన గంధము రాశిగా నలవరించి
నడుమగస్తూరియుంచిన బెడఁగుదోపఁ
చంద్రబింబంబు తూర్పున జగ్గుబూనె.

కం॥ ప్రణవము కందర్పాగమ
మున, కంబర ఘోణికిని సముజ్జ్వల దంష్ట్రా
భినవాంకురము, తమోవా
రణసింహము ప్రాచియంకు రాజుదయించెన్.

కం॥ కరనఖరంబులఁ దిమిరో
త్కర కరి కుంభములు వ్రచ్చి తారాముక్తా
వరమణులు జల్లి తూర్పున
గిరిగుహలోనుండి చంద్ర కేసరి వెడలెన్.

చం॥ అరుణశరీరమూని యుదయంబయి మిత్రుఁడుగానరామిఁదాఁ
గరములుసాచి పద్మినిని కౌఁగిటఁజేర్పఁగఁబూనినన్ సుధా
కరుడని(మోముమోడ్చి,నల కాముకుడున్ తెల తెల్లబోయె)దా
మురిపెమునప్పనవ్వెను కుముద్వతి(యింతయుఁజూచియాంతట నే

గీ॥ యామినీ పూర్ణతిలకా సుధాధరంపు
వచనసూక్తి బ్రహ్మ నీయుదరమునఁ బొదలు
నమృతపూరంబు దీయఁగ నచటఁదోచు
గర్తమదిగాని కాదు మృగంబు చందిరి.

కం॥ యూకీర్తి మారనారా
చారభటీధాటికులికి యమృతాంశునొగిన్
నారామృతధారావా
క్సారస్యము ముద్దుగుల్కఁగా వర్ణించెన్.

క॥ జాబిల్లి వచ్చుముచ్చట
లా బిల్హణుఁడిటు లమృత లహరిరాఁబలుకన్
ఆబిబ్బోక వతీమణి
తాఁబులకలు మేన సద్భుతంబుగఁ గమరన్.

వ॥ గ్రంథావలోకనంబు చాలించి కించిదంచత్కౌతుకిఁ చిత్తయై యిట్లని వితర్కించె.

ఉ॥ అంధుడు బిల్హణుండు తన యా తెరచాటుననుండి నీవు స
ద్గ్రంథము లన్నియున్ చదువఁగావలె నీతడు బుద్ధిధూత వా
తాంధయు సార్వభౌముఁడని తండ్రివిధించిన నమ్మియుంటి; జా
త్యంధుఁడ యేనియీతడు సుధాంశుని గాంచను శక్తుఁడెట్టులౌన్.

ఉ॥ నెయ్యము తోడఁ జెప్పెనని నే మదినమ్మితిగాని యిట్లు మా
యయ్య యసత్యవాదియని యెఱుగంగద, తాతకేమి నే

నెయ్యెడఁ దప్పు జేసితినొ? యీగతి వంచన మాచరించె పెన్
దయ్యమురీతి నేమనుగు దైవము నాదురదృష్ట మయ్యయో.

కం॥ కాలత్రియమందును గురు
లాలిత పదపద్మములకు లలి మ్రొక్కి తదీ
యాలఘువిధి విద్యాపరి
శీలన గావింపుమనుచు శిక్ష విధించున్.

గీ॥ చదువువేళను గురుపద జలజములకు
మ్రొక్కి చెంగటఁ గూర్చుండి ముదముతోడఁ
దన్ముఖంబున తనదృష్టి దార్చివార
లుచ్చరించెడి రీతిఁదా నిచ్చజేర్చి.

ఉ॥ చెప్పిన యర్థమెల్లఁ దన చిత్తములోనిడి యుక్తిదోచె నా
యొప్పుగుగీతిచే నడగి, యుత్తరమిచ్చినవారి యానతిన్
(దప్పక తప్పుదిద్దుకొని తా బహుధా ధనధాన్య సంపదల్)
మెప్పుగనిచ్చుచున్ జదువమేలగునంచు విధించుశాస్త్రముల్.

గీ॥ ఇట్టి విధిపూర్వకంబుగా నేను జదువ
నైతి మాయయ్య మాట తథ్యంబటంచు
నిపుడు చూచెద బిల్లణుఁ డెట్టివాఁడొ
యని మనంబునఁ దలపోసి యంబుజాక్షి.

వ॥ వ్రతభంగమైనఁ గానిమ్మని దిగ్గన లేచి తత్తరపడుచుఁ
బొత్తంబుగట్టిపెట్టి దిట్ట యగుఁ గాన తెరయొక్కింతచుక

యొరజేసి ముద్దుమొగము గానఁ పి పుచుండ.

మ॥ కనియెన్ కన్నియ చంద్రసుందరముఖున్ కంజాత్రపత్రాక్షునిన్
కనకాంచన్మృదు దేహుఁగంబుగళు ముక్తాచాకచక్యప్రభా
ఘనుఁ, కంఠీరవమధ్యుసం బృధులవక్షున్కున్ మణీహారకం
కణ కర్ణాభరణాంగుళీయక కనద్భైవేయునిన్ బిల్హాణున్.

కం॥ అత్తఱి చిత్తరిమీఁదన్
చిత్తభవుండార్చి పూవు సింగిణిచేతన్
మొత్తముగ గుప్పివిడఁ చెఁ త
ళత్తళ మను తమ్మితూపులను, తత్కవియున్.

వ॥ పొదుపు గుబ్బలి శిఖరంబు పిమ్మటనుండి కొంతగన్పట్టు శారదరాకా చంద్రబింబంబు రేవఁ దెంమరుంగున నొక్కించుక గనఁగు మగువ నగు మొగముఁగని యిట్లని వర్ణింపఁ దొడంగె నది యెట్టిదనిన.

చం॥ పరువపుఁజంద్రుడో సొగసుపద్మమొయద్దమొ నెమ్మొగంబొహా
స్మరవిశిఖంబులో (సరసి జంబులో చేపలొ కన్నులౌర! బం
గరు కలశంబులో లికుచ కమ్రఫలంబులొ చన్నులో భళీ
మెఱపొకొ లేక కుందనపు మేలిమితీగయొ మేనివింతయో?.

ఉ॥ కాదిది మోముసత్యము మృగంబెడబాసిన చంద్రబింబమే
కాదిది చన్నుదోయి సుఘఁ గల్గిన కాంచన కుంభయుగ్మమే

ఉ॥ నిండిన వేశ్యకన్ గలసి నిద్దపు గెంపని మోవి జాళువా
గిండులటంచుఁ జన్నుఁగవ కృష్ణమణిద్వయమంచు కన్నులున్
మొండగు మౌక్తికంబులని (మేల్ రదనంబులఁ జూచిమెచ్చనే)
దండఁజరింప నైతిఁగద దైవమ! విద్యయితండు చెప్పగన్.

క॥ (ఆచార్య పాదపూజల
నేచాయను చేయవలయు నిపుడాతని వా
ఙ్మోచాఫలరుచినలరెద
నాచిత్తముపల్లవింప నయవినయగతిన్.

క॥ గురుదక్షిణ యొసఁగెద నా
గురువునకున్ కనకకలశకుచపరి రంభం
బురువడి యామానచిత్తం
బెఱుఁగఁగదా నాదు భాగ్య మెట్లున్నదియో.

గీ॥ లక్షణంబు దెలిసి లక్ష్యంబు దెలియని
చదువదెంత నేను జదివినట్టి
రతిహాస్యమునకు నితనితోఁ బురుషాయి
తాంబుల రమింప నగునుగాదె.

ఉ॥ ఇంతియకాదు సఖీ యిపుడు హెచ్చుగ వచ్చునివింటిజోదు క
ర్ణాంతవికృష్ట పుష్పధనురాహిత కౌసుమ బాణజాల మ
త్యంతకృతాంత ధోరణుల నక్కట నాపయిఁ గుప్పజొచ్చె నీ
వంతమరంతమయ్యె బలవంతము దైవము చింతకంతకున్.

ఉ॥ చల్లనిగాలి తేరు జలజంబులు గోలలు పువ్వుచోక్కమో
విల్లు, మధువ్రతౌఘములు వింటికి నారి శుకద్విజావళుల్
బల్లిదులైన పోటరులు భావుక వృత్తులనుండ నీకు నేఁ
జెల్ల; ననాథ బాలికలచిక్కులఁ బెట్టుట మేలె మన్మథా

మ॥ అలపద్మాలయ నీకుఁదల్లియట పద్మాక్షుండు నీకేమగున్
భళి(రా పద్మభవుండు సోదరుఁడగున్) పద్మంబులస్త్రంబులై
విలసిల్లుఁగద; పద్మబాణుఁడవనన్ విఖ్యాతిజే నొప్పి భూ
స్థలిపద్మాస్యల నేచుటొప్పగునె? లోఁజర్చింపుమామన్మథా

ఉ॥ నీజనకుండు దీనులను నిత్యముఁ బ్రోచు నభీష్టదాయియై
నీజనయిత్రి కన్గడల నెట్టనఁ జూచిన నాశ్రితాళికిన్
రాజిలు సంపదోఘ మదిరా మదిరాక్షులనేచు బుద్ధి నీ
కీ జగతిన్ ఘటిల్లుటకు నెయ్యదికారణమయ్యె మన్మథా.

ఉ॥ హా మదనాభవచ్చరిత మక్కట చిత్రిముల(దలంచినన్)
సోమునకీవు నిత్యము త్రిశుద్ధిగ శత్రుఁడవంచు నమ్మినన్
సోమునితోడుతన్ విరహశోషితమోహిదు దీర్ణవేదనా
స్థేమము నెట్టులొందలివో? శ్లేష పదంబున నో మనోభవా.

మ॥ యలగోల్చిల్కల గుంపునంపిపిదపన్ హేరాళమైనట్టి కో
కిలపౌజుంబురికొల్పిపిమ్మట మతాఘోయుంచుఁబూసింగిణీ
బెలుచన్ దుమ్మెదనారిటంకృతులుబల్బిరంబుతోఁజేయుచున్
వలరాజిప్పుడు నాపయింగవియఁ దా వచ్చెంజుమీహా విధీ.

చం॥ ఒకతఱి నీలకంఠునకు నోడియనంగతఁ జూనె మన్మథుం
డు కుతలమందటంచు సుజనుల్ వచియింతురుగానినిత్యమున్
ప్రకటవియోగలోకములు బాధలుబొందగఁ బట్టి చంపుద
ర్పక ఘన నీలకంఠపరివారిత నొప్పదె చిత్రమక్కటా.

ఉ॥ మేడ గవాక్ష మార్గముల మెండుగ నిండిన పండువెన్నెలల్
వేడిమి కుప్పతెప్పలుగ విప్పగు నిప్పుల కుప్పలట్లమే
న్వేడిమి తూలజేయుతఱి బొంగుచు గబ్బిమరుండు నాపయిన్
వాడి మెఱుంగు కెంజిగురువాల్గొరదూయుచువచ్చెనార్చుచున్.

చం॥ సదయుఁడుగాక కాకలను చాలకృశించుచునున్న నాపయిన్
గొదగొని యార్చిపేర్చి బలుకోపమునన్ వలరాజువచ్చి తా
నదెపదనైన కెంజిగురుటాకు కఠారి బిరానదూసి నా
యురము మీటారియబ్బురపుటుబ్బులగుబ్బలఁగ్రుచ్చెనక్కటా.

ఉ॥ తీరని మారుబాణములఁ దేకువదూలిన నా యురస్థలన్
కీరమవేగ నోమధుర గీరమ చేరుసతోడ జెజ్జమా
యూరక సజ్జనుల్ పరుల నొందిన యాపద దోలుదురక్కటా
కూరిమినిన్నుఁ బెంచితి శకుంతశ నిర్దయతన్ వసించెదే.

మ॥ చెలియల్ దగ్గరలేరు, మారుఁడనుకార్చిచ్చిత్తరిన్ నాపయిన్
బలుపీఁకన్ గదిసెన్ శరీరము పయింబొటిల్లు పూదండలు
జ్వలకీలిత్వము బూని కాల్పదొణఁగెన్ శక్యంబుగాదింకిటన్
నిలువం దాళగఁజాలఁ జాలమ పిలో నిర్మోహివై తే విధీ.

ఉ॥ కోరిబిరాన కస్తూరపుఁ గుమ్మెద త్రొక్కఁ దలేక తెంపుగన్
చేరగరాని వెన్నెలను చిమ్మునఁజొచ్చెద గాక మల్లెపూ
ల్గూరిచికట్టి దండల సుకుత్తుకఁగట్టెద నిట్లుగానిచో
వారక మావికొంజిగురు బాకెప రొమ్మున గ్రుమ్మఁజూచెదన్

గీ॥ అనుచుఁ జింతింప బిల్వాణుండనియోఁ దరుణి
ని జెణుకుచూపు బాణముల్ నిండి నాదు
మేనఁదాపంబు రెట్టించె గాన వేగ
వచ్చి యధరామృతంబిమ్ము వాంఛదీర.

కం॥ నెలతమ్మి పూవులకు తా
తలమసి చిరునగవుగులుకు తాటంకయుగో
జ్జ్వలదీప్త కపోలంబగు
కలికీ నీమొగముఁజూపు గారవమొప్పన్.

కం॥ కలకల నవ్వమ శారద
జలజ జలజవైరిబింబ చకచకదీప్తుల్
తొలఁగింప సొంపునింపెడి
కలికీ నీ మోముఁజూపు గారవమొప్పన్.

కం॥ గిర గిర చక్రము లనఁగా
దిరుగుచు మధ్యమున గండు తేటులు గలమే
ల్సరసిజములనన్ చెలువగు
తరుణీ కన్దోయిముద్దు దయసేయఁగదే.

కం॥ ఒరపైన కల్వలనఁగా
సిరి గులుకుచు ఖంజనముల చెల్వమువుంచున్
తరమైన జగ్గుగలిగిన
తరుణీ కన్దోయిముద్దు దయసేయఁగదే.

కం॥ అద్దములనగా తల తల
నిద్దపు నిగ్గులను జగ్గునించుచు చాలా
ముద్దులు గులికెడి చెక్కులు
ముద్దియ ముద్దాడనిమ్ము మొనసిరతులలోన్.

కం॥ సరసమయి జంబుఫల సుం
దర భావము మించి మదన తాపజ్వర సి
ద్ధరసంబనఁ దనరెడి సుం
దరి నీ యధరామృతంబు దయసేయఁగదే.

కం॥ సరసంబై విద్రుమముల
దరముచు మార్దవ విలాస ధాళధళీ పూ
ర్ణరుచిర శోణద్యుతిగల
తరుణీ యధరాధరంబు దయసేయఁగదే.

కం॥ ధరలోన సుధా మధు శ
ర్కరలన్ మాధుర్యసిద్ధకథ వితథముగా
బిరుదువహించిన నీదగు
తరుణీ యధరాధరంబు దయసేయఁగదే.

కం॥ పరువడి తనరక్తిమ ముం
గర ముత్యము పద్మరాగ ఖండద్యుతిచే
సిరిగుల్కు తళ్కు గల్గిన
తరుణీ యధరాధరంబు దయసేయఁగదే.

కం॥ తరుచుగ తమిచే మిక్కిలి
గిరచిన నను"ముంచ ముంచ కరుణాకర తే
చరణాభ్యాన్నమ" యనుచున్
తరుణీ యధరాధరంబు దయసేయఁగదే.

కం॥ "సరసయుతం కురు బింబా
ధరపానం కుచయుగేతు త్వన్నఖరాగ్రైః
ఛురిత" మ్మని బెగడు పడుచుఁ
దరుణీ యధరాధరంబు దయసేయఁగదే.

కం॥ పరిరంభణాదులకు దే
వర లక్ష్యముఁ జెప్పుమనుచు వాంఛింపుచు నా
దరమునఁ గౌగిటఁజేర్పుచుఁ
దరుణీ యధరామృతంబు దయసేయఁగదే.

కం॥ కరసంగ్రహాజ్ఞేచ్ఛ పర
స్పరదేశము లాక్రమించి సంధి రహితతన్
దొరలవలె నాము కవిసిన
తరుణీ నీ చన్నులంట దయసేయఁగదే.

కం॥ అనవిని వనజాయత లో
చన సార్థకమయ్యె నాకు చక్రధనము బి
ల్హణుఁడంగీకరణోక్తుల
నను పార్థనగాఁ జేసెననుచు నప్వు మొగమునన్.

వ॥ మహార్హ శయ్యాతలంబుననుండి లేచి సవిలాసంబుగాఁ జనుదెంచి బిల్హణు పర్యంక సమీపంబునఁ బగడపు స్థంభంబు చాటున లజ్జావనత వదనారవిందయై నిలచిన నతండిట్లనియె.

కం॥ స్థంభమున చాటునిలువకు
మంభోజదళాయతాక్షి యంగజుఁడిదిగో
స్థంభంబున సాత్వికము
జృంభితముగఁ జేసె నహహా చిత్రముగాదే.

కం॥ పగవారల చే పట్టగఁ
తగవా మగువా భళీయధర బింబముతో
వగబూనిన వగతో నా
బిగి కౌగిటలోన డాగు భీతిల్లకుమా.

ఉ॥ తాళగఁజాల మన్మథుని ధాటికి బోటియిదేటి వింత రా
వే లలనాలలామ వినవే గురుధర్మము దేహమర్థమున్
తీలక నిచ్చుటే సకలదేవహితంబని విందువేగదా
చాలిక చాలుసిగ్గుపడి జాణవు జాగొనరింపమేలటే

చం॥ అని తనకేలుసాచి జలజానన హస్తముబట్టి పాన్పుపై
నునుప నొకింతసిగ్గుపడి యొప్పులకుప్ప మొగంబు వంచినః

మనమునను బ్బియుటనియె మానిని, ఘనుని మూర్ఛ పేర్చి తా
మనసిజుఁడిప్పు డిద్ధర సమంబుగ సేయఁగ జూచె నేటికిన్.

వ॥ రమణీమణిశిరోమణీ పంచశర శరపరంపరల పరితప్తుండ నైతి. యధరామృతంబు గోలంగనిమ్ము. వచస్సుధల శ్రవణేంద్రియ పరితాపంబు నివర్తింపం జేయుము. జృంభిత శాత కుంభ కుచ కుంభపుంభావ శరీర భదాభ పియూషంబున దేహదాహంబు మాన్పుము. మన్మధ మహారాజరాజధాని నభిషిక్తుం జేయు మింకం జిక్కులం బెట్టిన తాళంజాలఁ జుమీ యని గద్గద కంఠుడై చోరకవీందు్రిండు చెల్యంబునఁబల్కు, యంత

కం॥ చక్కెరబొమ్మ చోకాటపుఁ
జెక్కుల నఖరేఖలుంచి చిరునవ్వొలయన్
నిక్కముగా ఘురితంబిది
చొక్కముగాఁ దెలియుమనుచు సుందరికనియెన్.

కం॥ గబ్బి మెరుంగు చనుంగవ
నుబ్బుచు నంగుష్ఠనఖము లుంచుచుఁ బలికెన్
గుబ్బెత లక్ష్యంబిది కను
ముబ్బరమగు నర్ధచంద్రి మురుతర యుక్తిన్.

కం॥ చనుగవ క్రిందట తదయుఁ
దన వేల్గారుంచి మీద తరుచుగ నాల్గిం
టను గుచ్చి మయూర పదం
బున కిదిలక్ష్యంబు తెలియు ముగుదా యనియెన్.

కం॥ వాలారు గోరులన్నియు
బాలామణి చన్నుదోయిపై నిడి యనియెన్.
హేల శశప్లుత లక్ష్యము
లీలావతి యిది యటంచు లేనగవొప్పన్.

కం॥ ఉత్పల దళలోచన యిది
ఉత్పల దళమనుచు నొదివి యూరుస్థలులం
దుత్పలక దేహుఁడై ర
క్తోత్పలరుచు లీను గోరు లొయ్యన గుచ్చెన్.

కం॥ వనిత యధరాధరము ప
ల్మొననొక్కి లతాంగి కనియె ముద్దులగుమ్మా
మనంబునను ఘూణాక మిది
యని తెలియుము లక్ష్యసరణి యనువుగ ననుచున్.

కం॥ కలికి చోకాటపు డా చె
క్కిలి నొక్కి యతండు బలికె కీరవచన వే
తెలియుము లక్ష్యము దీనిం
బలుమరు మదిలోఁ బ్రవాళ మణికి సరసతన్.

కం॥ కెమ్మోవి నడుమఁ డిలకము
నెమ్మినతండొనరఁజేసి నెలఁతా లక్ష్యం
బిమ్మెయిఁ దెలియఁగఁదగు తిల
కమ్మున కిది శాస్త్రమనుచుఁ గడువచియించెన్.

కం॥ చరణంబులఁ జరణంబులు
కరముల కరములును నెమ్మొగంబున మొగమున్
సరి బిగ్గ కౌఁగిలింపుచు
తరుణికి తిలతండులంబు తగఁదెల్పె రతిన్.

కం॥ అలరుల పాన్పున నెనరుగ
చెలియను తమికొద్ది నేర్పుచేఁ గౌఁగిటిలో
పలఁబెనచి క్షీర నీరము
నెలఁతా యిది తెలియుమనియె నెమ్మనమందున్.

కం॥ అలరుల విలుదొర తరితీ
పులఁ జెలిఁ దొడ కడను నిలిపి పొలఁతుక కనియెన్
లలియూరులఁ బిడించుట
నలఁతిగ నూరూప గూహమగు వినుమనుచున్.

కం॥ తన కనుఁగవఁ జెలికనుఁగవ
తన నుదురుం జెలినుదురు తన వదనము భా
మిని వదనము పై పైనిడి
యనియెన్ బాలా పికాఖ్యమని సుందరికిన్.

ఉ॥ ఆరమణీ శిరోమణికి నారసికాగ్రిణి మన్మథాగమో
దారవిలాస రమ్యమయి తద్దయునొప్పెడి బాహ్యకేళి, యా
తీరున లక్ష్యబోధనము తేటగఁ జేసెదనంచు నల్వి కాం
చీ రమణీయదేశముసఁ జేర్చి కరాంబురుహంబు నేర్పునన్.

గీ॥ చోరుఁ డెప్పుడు తనదు హస్తారవింద
మాత్మ కరమునఁ బట్టెనో యపుడె భయము
స్తంభరోమాంచ దైన్యముల్ తరుచుదోఁచె
యుక్తమౌ భీరువులకిది యుక్తియందు

ఉ॥ చోరుడుబట్టి చేతులనుజూడుముచూడుమటంచుగ్రమ్ముచున్
గోరులు చన్నులన్ బసిడి కుండలుగొన్నను మేనెఱుంగదా
భీరువు యుక్తమే యతఁడు పేరిమికాంచి సడల్చి తిన్నగా
తోరపుఁజేల మూడ్చుతరి దోఁచు ప్రమోదముఁ జెప్పశక్యమే
ఆ రమణీ మణీ మణికి హాయది యుక్తముగాదెయెంచినన్.

గీ॥ కలికి పర్యాయమునఁ బరాక్రమముజేసి
యలసి తలతలమని ముద్దుగులికి కన్ను
దోయి యఱ మూయుచును వలదోయి విడువు
విడువు మొక్కెద నని ప్రియు నోడివె రతిని.

సీ॥ కెమ్మోవి యానినఁ కెమ్మోవి యానుచుఁ
కౌగలించిన తాను కౌగలించు
గోరులుంచినఁ దాను గోరుల నుంచుచు
గిలిగింతలిడ గిలిగింత లిడుచు
చుంబనంబొనరింపఁ జుంబనంబొనరించు
దైన్యమొందిన తాను దైన్యమొందు
బంధనంబొనరింప బంధనంబొనరించు
మణితమిచ్చినతాను మణితమిచ్చు

గీ॥ నిచ్చమెచ్చిన మచ్చిక నిచ్చమెచ్చు
సడలి కౌగిలి కౌగిలిసడలుగాను
రమణి తొలికూటమున నతిప్రౌఢ కరణి
మెప్పుగొనియెను రతిని నామేటిపలన

కం॥ పురుషాయిత రతి నలిపెడు
తఱిఁ బాదద్వయమునందు తగ నెగిరెడు సుం
దరి జడ శిఖి యొనర్చెన్
మరుచే చుబుకమనగనది మధురంబయ్యెన్.

కం॥ పతి కంఠ హంసరవముల
సతి గళజ కపోత నినద సంతతి చేతన్
ద్వితయాను సరణమున మద
వతి కుచచక్రములు కొంత వడకం జొచ్చెన్.

సీ॥ కస్తూరి పంకంబు ఘనమైన జోడుగా
పృథుల నితంబంబు కిదముగాగ
బలసిన కోడెగుబ్బలు హయంబులుగాగ
కాంతమా భ్రూలత కార్ముకముగ
చూపు దృష్టులె శరాసారంబుగా నను
రక్తియే మద కుంజరంబుగాగ
కాంచికా కంకణక్వణనంబె భేరికా
శంఖకాహాళ మహా శబ్దములుగ

గీ॥ నఖర దంతక్షతములు మేన క్షతములుగ
రాజకన్యక క్షత్రి ధర్మ మహితయగుఁ
గాన సంగ్రామ సమయంబుగాగ నుపరి
సురతముం జేసి యొంతయు సొంపుమీఱె.

కం॥ గిరులు గడ గడ వడంకెఁ
ధరబిట్టదరెఁ శశాంకుఁ దారలు గప్పెఁ
పారియాంబర మిట్టటులై
యొరగెను చెలి లేచి సురత మొనరించుతఱిన్.

సీ॥ నెమ్మోము తమ్మిపై నిద్దంపు కుంకుమ
మఱి చెమ్మటను కొంత కరగిజాఱె
చెక్కుటద్దంబులఁ జొక్కమౌ మకరికా
పత్రముల్ నఖముల భంగపడియె
తోరంపు మోవి లత్తుక కన్నుదమ్ముల
నొక్కింత దవిలి కెంపెక్కవయ్యె
మేలైన గొప్ప ముత్యాలహారంబులు
చిక్కని చన్నులఁ జిక్కుబడియె.

గీ॥ కొప్పు సడలగఁ జీకటి గప్పుకొనియె
నలత నిట్టూర్పుగాడ్పుల నందమైన
మోవితలిరాకు గందె నమ్ముగుద సొక్కి
ప్రియుని యెదమీఁద వ్రాలెఁ బేరిమి దలిర్ప

గీ॥ కన్నులఅమాసి యొకయించుకయును దెరచి
కొప్పువీడంగ నిట్టూర్పు గుంపులొప్ప
చెమట చెక్కుల నుదయింప రమణునెదను
వ్రాలు నీలాల కల యధరంబుగ్రోలు
వారి భాగ్యంబువర్ణించు వారు గలరె.

చం॥ మరునిరణంబునన్ జయము మాంతఁగాంచిన చన్నుదోయికిన్
నరమణి తారహారములు, వాతెర కొప్పగు వీడియంబు, చె
చ్చెర జఘనస్థలంబున కుఁజేలము చేతుల కంకణంబులుం
దరుణి యొసంగి వీడెనని, తాను సిగన్ వెస గప్పె నుక్తమే.

కం॥ పురుషాయితాది రతులం
దరుణీమణి కన్యయయ్యుఁ దా ప్రౌఢగతిం
మరుకేళిఁదేల్చె బిల్హణు
నరయగ శాస్త్రంబుచదివి నదిహేతువుగన్.

సీ॥ బంగారు బిందెలపైఁ గెంపురవలన
గుబ్బచన్నులఁ పచ్చిగోరులొప్ప
చివురాకుపై ముద్దు జిల్కనొక్కులనంగ
కెమ్మోవిపై బలుకెంపులొప్ప
పసిడి చొక్కపుఁ దమ్మిపై ముత్తెములనంగ
చెలఁగి మోమునఁ జిఱుచెమట లొప్ప
అరవిచ్చు తమ్ములయందు లేదొండనఁ
గన్దోయిపైఁ దామ్రకాంతియొప్ప.

గీ॥ చిక్కుబడినట్టి ముత్యాల చేర్లు విడిన
కొప్పు కరగిన కస్తూరి ఘుమ్మురనుచు
జారుపూదండలు విలాస సరణిఁజూనఁ
కాంత వింతగ నొప్పె గత్యంతమందు.

కం॥ ఇక్కరణి నాయకాగ్రిణి
యక్కరి గమనయును కోర్కులలరఁగ రతులన్
సొక్కిరి మన్మథుఁడుత్తజి
చక్కెర విల్ నారిడించె సమయజ్ఞతచేన్.

గీ॥ తావి మిగిలి మేలి తావిపూతలదోన
కవయ మిగిలి యుండెఁ గమ్మవింటి
దొరకు; నిద్రముంపుదొట్టినఁ గౌఁగిలి
సడలి నిద్రఁజెందెఁ జంచలాక్షి.

వ॥ ఇట్లు బిల్హణ యామినీ పూర్ణతిలకలు క్రీడించి పంచశరుఁ గృతార్థుఁజేసి సుఖంబున పూసెజ్జ నిదిరించునంత.

చం॥ అనయ మటంచు భీతిలక నాత్మల నమ్మిక చెల్ల పిరలే
యనువున మేము గన్గొనఁగ నద్దిర నమ్మద ముల్లసిల్లగా
మనసిజు కేళిఁదేలిరని మాటికి మాటికి విస్మయంబుచే
తను తలలూచెనోయనువిధంబున లోలము లయ్యె దీపముల్.

ఆ॥ వె॥ చోరసాహసంబు సుందరి తెలుపును
రాజు చెలియనేమి యోజయగునొ.

యనుచు వెల్ల బాటునందెనో యని పొందు
భావమూనె దీప పంక్తులపుడు.

ఆ॥ వె॥ గెలిచె గెలిచె గెలిచె యలరు విల్దారయని
సంజ్ఞచేతఁ బొగడు చందమునను
మొరసె తామ్రచూడము లత్యుప్తులకు గుండె
ఝల్లుమనఁగఁ గోరె యుల్లసిల్ల.

గీ॥ మునుపు మిత్రాధికారాంతమున మహోద
యంబుఁ బూనితి దోషాకరాత్మ వృత్తి
నతఁడు పూర్వాద్రి సింహాసనాధి రూఢుఁ
డైనతఱి నుండరాదని యబ్జుఁడరిగె.

కం॥ మునుపటి యట్టులు ద్విజ రా
జునకుంగడచనిమె నుండఁ జొప్పగునే యీ
యనువున మనకని తొలఁగెనో
యన సద్గణ మపు డదృశ్య మయ్యెం జూడన్.

ఉ॥ గాంగదళత్స రోజముల ఘుమ్మను తావుల నోలలాడి సౌ
ధాంగణ పుష్పశయ్యల సుమాస్త్రుని కేళుల వ్రాలినట్టి ప్రౌ
ఢాంగ నిదాఘమూడ్చి కుసుమావనతద్రుమనీడసుప్తవై
హాంగము మేలుకొల్పుచు(నహర్ముఖ)వాయువులొప్పెనత్తఱిన్,

గీ॥ లోకమునను తమము లుప్తమై చన శుద్ధ
భావమూని యొప్పె భవ్యగతిని

యుక్తమిది యనంగ నొప్పు నెట్లన సారిఁ
గానవచ్చు నప్పుడ్డెను తెలివి.

కం॥ మందేహా దేహాబృంద
స్యందదుసి౹ది రౌఘ మాకసము ముట్టిన య
ట్లాదముగ రక్తభావము
మందముగాఁ దూర్పునందు మహితంబయ్యెన్.

ఉ॥ దగ్గఱ సూర్య రథ్యముల తామగనుంగొని తూర్పుగట్టుపై
నగ్గలమైన కోపమున నయ్యెడ ధాతుమయస్థలంబులన్
నుగ్గుగజేసి మింటికిఁగనుంగొనఁ జిమ్మెనో సైరిభంబునా
జగ్గుగ బాృచియందు జగజంపగు కెంపువయించె సొంపుగన్

కం॥ అరుణుఁ డుదయించెఁ బాృగ్ది
క్తరుణీ మణి సమయధవుడు తనుగలయగ రా
శిరమున శోణమణీ మం
జరి భూషణమిచ్చినట్లు సహారక్తిముఁడై

కం॥ కరములఁదన్ ద్విజరాజా
దరమున నవ్వించి పాదతాడనజేసెఁ
నెరి నద్విజుడన యని ముఖ
ము రహి కుముద్వతికిఁ జిన్నబోయెఁ మిగులన్.

కం॥ దినసాధి నాయకుండ
య్యావ సరమున నుదయమంద నందెను లోకం

బవితథ తేజము యుక్తం
బవు నిది భువనాప్తుఁడాతఁడైన కతమునన్.

కం॥ ఇనుఁడుదయించిన చక్రిము
లనుపమ జీవనము బెరసి యామోదముతో
నెనసెన్ సరసులు సంతస
మునఁ కర్మఠ జనములొప్పె మునుమున్ ధరణిన్.

కం॥ అంతకుమున్నె కన్గొని
తాంతమహీధరజ బోధతాగ్యదావద్యా
నంతరవంబుల మేల్కని
సంతోషము మదినిబొంగ సవిలాసముగన్.

ఉ॥ కన్నులఁ కెంపు మోవిపయిఁగాటుక సొంపును నిద్రమంపుమే
ల్చన్నుల గోర్లగుంపు నరజారినవేనలి జగ్గు పెంపునున్
చెన్నగు తారహారముల చిక్కన వీడిన కోక పెక్కునున్
వన్నియఁబెట్ట పాన్పుపయి వామవిలోచన లేచె ముందుగన్

ఉ॥ వీడిన నీవిబట్టుకొని వింతగజారిన పైట లోపలన్
షోడిమియైన చన్నుగవ ముద్దులు గుల్కగ కొప్పుచక్కగా
తాడనజేయుచున్ నిమర దొట్టునఁకన్గవ కెంపు సొంపుతోఁ
చేడియ పూలపాన్పునకుఁ జెంతనునిల్చెను వన్నెమీఱగన్.

వ॥ వలువ చక్కజేసి కలికిచన్నులుచొక్క మైనరవికెసరిది
ముబ్బురంపు కొప్పు దురిమి మొగము కొంతసిగ్గునఁ దలవంచి

మొలకనవ్వుతోడ ముద్దుగుమ్మ గురుశిఖామణియైన చోరకవీంద్రుని చరణారవిందంబులకు నమస్కరించి యచ్చంచలాక్షి యక్షీణ విలాసంబున నెలరాల పన్నిటిగిండి డాకేలనమర్చి కేళీమందిరంబువెడలె నంతటనతండును తగురీతి నిర్గమించి కాలోచిత కృత్యంబులు నివర్తించి యెప్పటియట్ల నిజకార్య కారియై ప్రవర్తించె.

కం॥ ఆ చోరకవీంద్రునితో
నాచంద్రార్కనన నిరంతరానందము పెం
పైచిత్తమందు మించగ
నాచరితతదీయసేవ నైయొప్పారెన్.

ఉ॥ చండ భుజాబల ప్రబల శాత్రవభూరుహ దావవహ్ని కో
దండ ఘనా ఘన ప్రకటదానకళా పరిపోషితార్య స
త్పండిత మండలార్థిగణ భావభవాభ నిజాంగ సౌష్ఠవా
ఖండవిలాస భాసురమృగప్రభు సుక్రమ విక్రమ క్రమా.

కం॥ నిరతాన్న దాన కలనా
పరతంత్రవిచార చార వర పర తంత్ర
స్ఫురగా హార షడ్గుణి భా
సురశాస్త్రధురంధరత్వచుంచుష్ఠేమా.

వినుత సుగుణ జాలా విశ్వ విశ్వైకపాలా
మనసిజ సమ రూపా మానవేంద్ర ప్రదీపా
కనకకుధర ధీరా గర్వ్య వాచావిదూరా
వనజభవమసీపా వాక్య నైపుణ్య భూపా.

గద్య. ఇది శ్రీమదరవిందనాభ పదారవింద మిళిందాయమాన
మానస భారద్వాజ పవిత్రగోత్ర చెన్నూరు
రామచంద్రకవీంద్ర పుత్రాంధ్ర గీర్వాణ
భాషాకవితా సుమనోద్రిశోభనాద్రి ప్రణీ
తంబైన శృంగార సుధాసముద్ర
పూర్ణ చంద్రోదయంబను
మహా ప్రబంధంబునందు
తృతీయాశ్వాసము.

మంగళము.

శ్రీ శుభమస్తు

# శృంగారసుధాసముద్ర పూర్ణచంద్రోదయము.

## చతుర్థాశ్వాసము

కం॥ శ్రీలావణ్య పయోనిధి
వేలాయిత మోహనాంగ విలసిత రమణీ
కేళీ ప్రవీణ సత్పరి
పాలక శ్రీ గుమ్మడంపు పాపయ్య నృపా.

వ॥ అవధరింపుము.

కం॥ ఈరీతిని నక్తందివ
మా రసికాగ్రణిసుఖైక యత్నుండై శృం
గార రస బ్రహ్మానం
దారూఢిని కన్యతోడ నలరుచు నుండన్.

వ॥ అది యెట్లనిన యోగ్య సమాగమంబు జన్మాంతరీయ్య సుకృతఫల భాగ్యంబునఁగదా యది గావున నభ్యుదయ్రభావుండు భావభవ విభవ కళావిశేషంబులగు స్పృష్టక విద్ధావ ఘృష్టక

పీడన లతావేష్టిత వృక్షాధిరూఢ తిలతండు లక్షీరనీరోపగూహాస జఘనోప శ్లేషస్తనాలింగనంబులను నిమితక స్ఫురితక ఘట్టిత తిర్యగాఖ్యపీడిత విఘటితోత్తర సంపుట స్పర్ధ ప్రాతిభావ్య శాయికా చుంబన ప్రముఖ చుంబనంబులను ఛురితార్ధ చంద్రి మండలక మయూరపద శశప్లుతోత్పలదళ ప్రభృతి నఖక్ష తంబులను గూఢక చూనక ప్రవాళమణి తిలకమణి మూల బిందుమాల ఛిన్నాభ్రిక మండలాకృతి యుతకాల చర్విత్తాది దంతక్షతంబులను పురుషాయితోత్తానవ్యానతాదికరణంబులను, చంద్రికాంత సౌధోపరి భాగంబులను సాంద్రచంద్రి శాలాంత రంబులను కుసుమితారామాంతర్వాసంతికా నికుంజంబులను లామజ్జక మంటపంబులను ససారస కాసార సమీపరమ్య ప్రదే శంబులను స్వచ్ఛంద కందర్ప నిగమాంత రహస్యంబులు కోమ లాస్యకు లక్ష్యప్రధర్మనంబని రమియింపం జేయుచు విలసిల్లు చుండె నంతట కొన్ని దినంబులకు.

మ॥ ఒకనాఁడా మదనాభిరామ నరనాథోత్తంసుఁడానంద సం
 వికచస్వాంతతఁ చంద్రశేఖరుని తా వీక్షించి యేకాంతమం
 దోకవాక్యంబువచించి చోరకవియేయుక్తిన్ మదీయాత్మజన్
 సకలార్యస్తుత సాహితీ నిపుణ విజ్ఞానందగం జేసెనో.

గీ॥ పుత్రినైనట్టి యామినీ పూర్ణతిలక
 నాటనుండియుఁ గావ్యముల్ నాటకములు

మఱి యలంకార మదనాగమంబు లేమి
చదివెనో యిప్పుడు పరీక్ష సలుపవలయు.

కం॥ నారీమణి రామాయణ
పారాయణమున తదర్థ పారీణతఁ బెం
పారిన నామది సమ్మద
పారావారమున దేలు భవ్యమనీషా.

చ॥ అనవిని చంద్రశేఖరుఁడు హార్దమునన్ మదనాభిరామ చం
ద్రుని కనియెన్ నరేశ్వరగురుస్థితి విద్యల నభ్యసించు భా
మిని కడకొక్క దూతికను మీరలు బంపి తదీయ కృత్యమే
పునవిని యంత బిల్హణుని బోటిని బిల్వఁగఁ బంపఁగాఁ దగున్.

చ॥ అన మదనాభిరామ నృపుఁడౌనని చెంగటనున్న సత్యవా
దిని యను దూతికిట్లనియెఁ దీవ్రముగా జని చూచిరమ్ము బి
ల్హణకవియొద్ద కావ్య మబలామణి తాఁ దెరచాటు జేసి యొ
య్యనఁ బఠియించుచున్న యదియంచితరీతి నెఱుంగఁగావలెన్.

కం॥ అనుచు సెలవిచ్చి పంచిన
చని వేగమ దూతి యపుడు చదువులబడిలోఁ
గనరామి వారు, కన్యా
మణియంతః పురముఁ జొచ్చి మచ్చిక తోడన్.

సీ॥ నవరత్న కనకాసనమున బిల్హణుఁడుండి
తన తోడమీద సుందరిని నిల్పి

కస్తూరి తిలకంబు సిస్తుగా నుదుటిపై
దీర్చి చెక్కుల నేర్పుదేట పడగ
మకరికాపత్రి నిర్మాణంబు జేసి చ
న్నులమీదఁ గాశ్మీర మలఁది సిగను
పూదండలుంచి యొప్పులకుప్ప యొప్పొనె
మించుటద్దముఁ గాంచుమంచుఁబలుక

గీ॥ మొలకనవ్వునవ్వి లలన యందముఁజూచి
యిచ్చమెచ్చి కౌగిలిచ్చియతని
మోవినొక్కి సొక్కి మురిసియుచు నుండఁగ
జూచె రాజమాతి చోద్యమంది.

ఉ॥ చేరగవచ్చి బిల్హణుని చెంగటనిల్చి తదీయపాదపం
కేరుహముల్ భజించి నృపకేసరి పుత్రికయుక్త రీతి పెం
పారగగాంచి యమ్మ ముదమందగ నేనిను గాంచవచ్చితిన్
చోరుడు విద్యఁ జెప్పుతరి చూడగఁ గోరితి నామనంబునన్.

కం॥ చోరకహిందుర్లిలు వీరే
వా రమణీ మేలెయింత వారలతో నీ
పేరీతి నుండఁగంటిన్
ధారుణి గురుసేవ ముఖ్య ధర్మముగాదే?

గీ॥ అనుచు సొల్లుంత నంబాడి యాకుమారి
తోడ తాత్కాలికో చితోక్తులను బలికి

తానువచ్చుట్ల జెప్పక ధాత్రిరీతి
నంతనాజ్ఞాప్తమైదూతి యరుగఁదెంచి.

మ॥ జననాథాగ్రిణిఁ గాంచిముట్లనియె వాఛాప్రౌఢిచే సత్యవా
దిని జోహారు నరేంద్ర జెప్పెదను మద్వృత్తాంతమట్లాజచే
తను కన్యామణి యింటికేగియట విద్యాహృద్యసంబంధ బి
ల్హాణచం[illegible] స్యలులేమినవ్వలికి హేలంబోవగా నచ్చుటల్

వ॥ ఒక్క[illegible]నుయూసనంబున బిల్హాణుండు, తనతోడపయి
పయిదలినిడి [illegible]కారంబొనరించుచున్నవాడు. క్రీడావతియును
సరస సల్లాపంబుల నున్నయది. ఇదియున్న తెరంగు విన్నవించితి
ననృథాకథనంబు, స్వామిద్రోహంబు గదాయని, సత్యవాదిని
సత్యంబుగాబలికిన ప్రభుశిఖామణి కటకటంబడి, చంద్రశేఖ
రుండును, తానును యామినీపూర్ణతిలక [illegible]వాణంబునకు జను
చుండె, నంతకుమున్న కన్నియ మాతీ, నిర్గమనాంతరంబున, బిల్హా
ణుండు, తానును రాజదూతికాగమనంబు రాజాగమన హేతుక
రంబుగా శంకించి చోరు నిజవాసనంబునకుంబంచి ననాధ్వసయై
యుండె నత్తఱిదౌవారికంచుకీ సంచయంబువచ్చి, యచ్చంచలాక్షికి
నరపతిజనుదెంచుట యెఱింగించిన కించదంచత్సంరంభయై యెద
చేగిమ్రొక్కిన నక్కువలయేశ్వరుండు, క్రోధంబున శోణారవింద
నయనంబుల నయ్యంబుజాక్షిముఖాంబుజంబువీక్షించి, పంచశరశర
ప్రేరిత సంభోగచిహ్నంబులగు నఖదంతక్షతాదికంబు లవలోకించి
కించిచ్చల దోష్టుండై యిట్లనియె.

మ॥ తనయా రాజకుమారులన్ విడచివిద్వాంసున్ గ్రహింపంగ నీ
మనసెట్లొప్పెను రాజకన్యవుగదా మర్యాద యానా ధరన్
వినవే పెద్దలు జెప్పుచుందురుగదా విద్వత్సుదారిద్ర్యతా
యని తద్వాక్యముదగ్ధమయ్యెనుగదా హాయేమిసేయందగున్

శా॥ బాలా బిల్లణు చెంగటంజనువుచో బాధింపగాఁ జేసితిన్
వాలాయగంబునేఁ దిరస్కరణి శేవన్ మధ్యభాగంబునన్;
ప్రీలెన్నాహృదయం బెఱుంగగను; పుత్రీ నేటికీరీతిఁగా
వ్యాలంకార కళాగమంబులను, నభ్యాసంబుఁ గావించితే.

కం॥ చోరుండీతఁడు జారుఁడు
తీరని కోరికలఁగూడి ధీరుండయ్యెన్;
మీరీ కార్యం బేటికి
గా రచియించితివి జగతిఁగలదే యిటులన్

కం॥ తనయా నీపయిమోహము
నినుఁ జంపగనీదు; ధరణినిర్జర వరుఁడీ
యనువున నిను గావించెనో
వెనుదీయక శిక్షఁ జేసి విడచెదవానిన్

కం॥ తెరచాటున నుండియు భూ
సురునికి నీకెటు మొదల చొప్పడియెను ? దు
ర్భరమయ్యెఁ కార్యఘటనా
సరణి యథార్థముగఁ జెప్పుసరసిజ నయనా

గీ॥ ఇట్టిదుష్కార్య మొనరించి తీవ్రమిగుల
నపయశము దెచ్చితివి యోర్వ నగునె నాకు
చంపవలెనిన్ను; బాలవు చాలమమత
గలదునీమీదఁ బుత్రివి గాన తెగను.

ఆ॥ వె॥ అనిన ధీరగాన నయ్యామినీ పూర్ణ
తిలక తండ్రితోడఁబలికె మేఘ
మించుకంత సూర్యునెనసి కప్పినమాత్ర
నలిన రక్తయగుచు నవ్వకున్నె.

గీ॥ పుడమి మల్లీమతల్లి సంపుల్లయయ్యెఁ
గంట కాంక్రాంతమైన భృంగంబుజనదె
పల్లవిత వల్లికని కుజతల్లజంబు
చెంతవసియించి విడువంగ చిత్తమిడునె.

కం॥ అన భూపుఁడుగ్ర కోపం
బున మంత్రినిగూడి తీవ్రముగఁ దాఁజావడికిన్
జనుదెంచి చోరుఁబిలువం
బనిచిన నతఁడేగుదెంచె భయకంపితుఁడై

వ॥ కనుగొనల నవల కణంబులు గురియచతండ తనికిట్లనియె.

ఉ॥ చోరుఁడ నంచునేనెఱుగ శుద్ధధరామర వంశకోటిలో
ధీరుఁడవంచుఁ గన్నియకుఁ దేకువ శిక్ష యొనర్పుమన్న నీ

వీరహిఁ(చోర కృత్యమున నేక వినింద్యత నందె మత్తనూ
జా రమణత్వమూనితివి జారతచోరత నీకు నబ్బెనో?

గీ॥ జారచోరత్వములు గల పూరుషులను
దండనము జేయవలె రాజధర్మమందు
నీవు శుద్ధాంతమునఁ గన్యనియమ మిట్లు
భగ్న మొనరించితివి దుష్టభావమూని

వ॥ కావున వధ్యుండవుగదా యని ధార్మికులవలన ధర్మశాస్త్ర బట్టి విచారించివధయని నిర్ణయించి తలవరులంబిలిపిం చోరునప్పగించి తలవరులారా యితఁడంతఃపుర ద్రోహంబుజే వధ్యుండు వధియింపుఁడనిన, వారునమస్కరించి దేవా నిగ్రహ నుగ్రహ సమర్థత్వంబు నీయందెగలదు విమృశ్యకారిత్వం నిశ్శ్రేయస సంపాదకంబుగదా దేవరకొప్పెను ధర్మంబుపన్యసిం వారమె, విజ్ఞాపనంబు జేసెదము కావున విచారించి సెలవిమ్మ నవుడు, వధ్యస్థలంబున నితడుసేయుపసియు పలుకు పలుకుఁ మా కెరింగించి తదనంతరంబు వధియింపుఁడని బలికిన వా చోరునిం బరివేష్టించి చన నప్పుడు రాజమార్గంబునందు.

గీ॥ కటకటా బిల్హణునకిట్టి కష్టవృత్తి
వచ్చెననువారు కర్మకి స్వకృత ఫలము
నరయుఁడనువారు నత్యుగ్రక్రియఃపతనని
దానమనువారు చూచుచో తరతరంబు

కం॥ తలవరు లతనిఁ బట్టి వధ్య
స్థలమునకుం దోడుకొనుచుఁ జని ఖడ్గంబుల్
ఝళిపించిన కలకల నగి
విలసితగతి వెలయునట్టి విప్రునిఁ వారల్

కం॥ తలవరులు కేడి తరి నేటికి
కలకల నవ్వితివి దీనికారణ మేమో
తెలియఁగఁ జెప్పుమటన్నన్
తలవరులకుఁ బలికె నతఁడు తథ్యముగాఁగన్

కం॥ తలవరులారా వినుఁడీ
జలజానన మీననయన చామీకరకుం
భలసిత కుచ నామది లో
పలఁగానగ నయ్యె పుణ్యపరిపాకమునన్

కం॥ మోహన విద్యయె చక్కని
దేహము ధరియించి నృపతితిలకాత్మజయై
మోహింపఁ జేసె నిట నా
దేహము రక్షించు మనుచుఁ దెలిసితలఁచెదన్

కం॥ అనినన్ తలవరులాతనిఁ
గనియింక ముహూర్తమాత్రి మాగెదము మరిన్
వనజానన భావింపుము
ఘననిశ్చలబుద్ధి చోరకవి యనిన వెసన్.

వ॥ అంతట నిశ్చలచిత్తుండై, చోరకవీంద్రుండు నిరంతర స్వారాధ్యమాన దేవతగా రాజనందనను, భావించి శాక్తేయ మత చక్రవర్తి గావున పూర్వానుభూత విలాసచేష్టల వర్ణింపం దొణంగె నది యెట్టిదనిన.

ఉ॥ చక్కని జాళువాపసిండి సంపెగదండలరీతి గోరయై
చొక్కపుగన్నుదమ్ములను చోద్యపుదారను జిల్కు తేజి రా
జెక్కెడుముద్దుమేను సొగసీయగ నిద్దురలేచి నట్టి యా
చక్కెరబొమ్మ నెంచెదను సన్నుతపరిశ్రమ విద్యకై వడిన్

చం॥ పరుసపుదమ్మి దుద్దుగతి భాసురమై నవరోచనంబుచే
విరచిత చిత్రకంబునను వింతగఫాలముగల్గి మత్తభా
వరుచిర ఘూర్ణితంబయి విభాసిలుచున్ నవదృష్టిగల్గు సుం
దరతరుణీ ముఖంబు (నిదె నామది నిప్పటికిన్ దలంచెదన్.)

చం॥ ఉపరతిలోశ్రమాధికత నూరిన చెమ్మట నీటిబొట్లు ము
త్యపుసరులొక్కచొక్కమగు తెల్విమొసంగగ, జెక్కుటద్దముల్
చపల సువర్ణకుండల విశాలచకచ్చక దీప్తిఁ గప్ప ని
క్కపుసొగసూను కన్నియ, మొగంబుఁ దలంచెదనిప్పుడున్మదిన్

ఉ॥ ఆరమణీశిరోమణిని యాజవరాలిని, యాలతాంగినిన్
యారుచిరాననాంబురుహ నక్కట కన్నులఁజూడ కెట్టు, నీ
తీరున కాముబాణముల తేపువ దూలిన మేనుచల్లనై
యూరట గాంచువాడ నయయో విధి, యింకిట నేమిసేయుదున్

ఉ॥ చొక్కపు జవ్వనిన్ గులుకు చోద్యపు గుబ్బల యుబ్బు గల్గి పెం
పెక్కిన ముద్దుగుమ్మను సమృద్ధశరచ్ఛశి సుందరాననన్
మక్కువ కౌగిలించి సుఖమంజుల పద్మముఖీరతి యెత్తి నే
చక్కెరమోవి పానకము చాలకదావఁదలంతు నిప్పుడున్

చం॥ అలరుల పాన్పుమీఁద చెలి యుల్కను పల్కక నొత్తిగిల్లినన్
బలుకకవీవశక్ విసరిబాగుగ కమ్మలనుంచు చేష్టనే
(వలచితమిన్ మృదూక్తులనుబల్క వికాసికనవ్వ భామినిన్)
దలఁచెదఁగాక యెన్నిటికి ? దైవమనూర్పుము రాజకన్యకన్.

చం॥ కులుకుమిటారి యుబ్బురపు గుబ్బల యుబ్బు వినీల నీలమం
జులకుటిలాలకంబులను చొక్కపు మేల్జిగి కొప్పు నొప్పు త
న్నుల్లలబురణించుకన్నుగవ ముద్దుమొగంబును మోవి కెంపుసొం
పులుగులుకంగ నొప్పు దలంతు గుహాక్షి కైవడిన్

చం॥ పరువపుమల్లె మొగ్గల నెపంబులుబల్కెడు చొక్కమైన ప
ల్వరుస, యొకింత పుష్టముగ వాచుచు జూచెడు కన్నుదోయి యు
బ్బురపు మిటారి ముద్దొసగు పున్నమ చందురు గేళిఁ జేయు సుం
దరి మొగమీన్ దలంచెదఁ గృతజ్ఞుని రీతిఁ బగోపకారమున్

చం॥ కలకలనవ్వు చందురుని గందగఁ జేసెడు కొమ్మమోము నూ
ర్పులకరు దెంచుతు మ్మెదలపొంకపు మోతల, కించుకంత యొ
ప్పులదోర పూవుగోలలను పొల్పెసలారుచు వెల్లనైనఁ జె
క్కులఁ కనుదమ్ములన్ సొగసుగుల్కు నటుంచుఁ దలంతు నాత్మలోన్

చం॥ ఎడమభుజమ్ముమీద నొకయించుక జారెనకొప్పు
విడిబడి ముద్దుగుల్కఁగొక వింతగమర్మముమీఁదఁజేఁ
నిడి నిరతిన్ మరుల్ గొలుప నెప్పుడు, తప్పకసన్ను జ
తడబడనట్టి (నా చెలినె దన్ దనివోవఁదలంతు సి

చం॥ లలననొకర్తుగూడిన విలాసముతోఁ జెలికేనుమొ
తలతలమంచు దోఁచుచును తత్తరపాటున బోవఁ
చెలిమిని బట్టసిగ్గుకొని చెక్కులఁగన్గవ నీరుజారగా
వలదనియుబ్బడించి చను వామ విలోచన నెంతు నె

చం॥ అలసిరతాంతవంజు సొగసైనకనుంగవ ద్రిప్పిమూ
ద్దులవగచిన్ని యూర్పులను, తొల్లిటిజగ్గుడొలంగి
తళుకుమిటారి తెల్వియు, నితాంతమనోహర ఘర్మ
కులుకువగల్ ధరించు నల కోమలిమోముఁ దలంతు

మ॥ అపరాధంబొనరించ లేదనుచు నేనత్యంతమున్ బాగ
సిపదద్వంద్వము మీద వ్రాలినను గాసిన్ దైవమాఁ
ద్దపు కెమ్మోవిమెట్టుఁగుటూర్పులకు గందన్ కంఠ స
శు పయస్వంబున బల్కకుండుసుదతిన్ సుశ్రోణినే

చం॥ తమి వెలిబట్టి చీర మదిఁదత్తగనూఁడుచు వే నితంబ
బముపయి సిగ్గుసిగ్గు తడబాటున జాణతనంబుజగ్గ
దముడగసందడింపఁగర తామరసంబున గప్పికొను
హాము, నతనాభి యుండునొకహస్తమునుంచినతా

ఉ॥ అద్దముఁజూచిన మదర్పిదనఖాంకితమైన మొగంబుచూచుచో
ముద్దియ వెన్క నేనొదగిపోయిన నీడ యొకింతజూచి నా
యొద్దనెయుండె నీతఁడనియుల్లము ఝల్లన సిగ్గుజగ్గునన్
గొద్దివడంకు జంకుగల కోమలి నిప్పటికిం దలంచెదన్

చం॥ మొగమనుతమ్మివాసనకుమోగ్రియుచువచ్చెడి మేటి తేటులన్
సొగసుమిటారి పద్మమునజోఘ్రుచు మించులమించు తళ్కు జె
ళ్కు గలకనుంగనణ్వగనుకొంచెమువంచుచుముద్దుగుల్కుచున్
జిగిగలవింత వాసనలఁ జెల్వగుచెల్వను జూతునెమ్మదిన్

ఉ॥ ముందర వెన్కపార్శ్వముల మోసలముంగిట నింటిలోన వం
దంద చొకాటపుం బసిడియందపుమోమున నడ్డజూపుచే
గందములైన కన్నులొక యబ్బురపుంవగఁ గుల్కుజాళువా
యంబెలుమోగ్రియగా దిరుగు నాఁ వరాలి విరాలినెంచెదన్.

చం॥ అలుకను కేలుదమ్మి మొగమందిడి నేఁజనుదెంచుదోగ్రివఁదా
దలకకి చూచుచుండఁగని తల్పుమఱుంగున నేనుడాగ మ
స్తులదొరరార దాగెదవుదొంగవలెన్ భళిరాయటంచు న
న్గలరవవాక్కులన్ బిలుచుకామిని నిప్పటికిందలంచెదన్.

చం॥ చికిలిమెఱుంగునవ్వులను చిక్కనివేల్పుల బువ్వతీపులన్
చకచకలీను కెంపుగల చక్కనిమోవిని ముద్దుగుల్కుద
న్పకరసపేలవంబులగు భామినిమేలపుమాట లేను త
ప్పకమదిలోననిప్పటికి భావనజేసెద బాపురేవిధీ.

ఉ॥ తీరుగఁ జెక్కుటద్దములఁ దీర్చినకస్తురి పత్రిరేఖలం జే
తోరపుమించిగంధమున దోఁచినజగ్గాకకాంతవింత గ
నేరుపుకన్నుదిప్పుటయు నిబ్బరపుంజిగి గబ్బిగుబ్బ
బ్బారుటగల్గి నిచ్చలుసముజ్వల మాచెలిమోము॥

చం॥ తడవుగ నేను బోనితరి తాళగలేకను మారుబారి
గడుసరియైన యొక్కచెలికత్తియతోడుత వచ్చిచ
పడకగృహంబు దాపునను పల్మరునవ్వుచునంత న
లిడుచుహసించుచు న్వెదకునింతిఁదలంచెద చాల

చం॥ మదనునియిల్లుజూతునను మక్కువఁజొక్కపు
మదవతి యోరమోమునను మాటికి మాటికి న
లుమటుమిటారి గుబ్బకవ యుబ్బునకొనువడంక
గదలగ గోకిసిగ్గుగొను కామిని నిప్పటికిం దలం

చం॥ బిరబిరవింతగావలపు పేరిమివాలి జొచ్చివచ్చి
తెరగోకయింతగాంచుచు సలిత్వరితంబునఁ కన్ను
ద్దురనటియింపనేను చెయితోడుత మెల్లనమేను
క్కరఁబులకించిలేచినగు కామినినిప్పటికిం దలం

చం॥ చాలును చాలురాకుమని జాణతనంబునఁ బలి
మేలములాడుచు న్వలపుమిక్కిలి గల్గుట వన్న
దాళగజాలరాయని నితంబము మెల్లన తానవా
దోళనమాచరించు నల తొయ్యలి నిప్పటికిందలం

చ॥ కలకలఁ బువ్వుమోమున జగాతలసంబుల మేడమీఁదటన్
చెలియలతోడ కూటముల సిగ్గరిముచ్చటలాడు నంతనా
గాలికిడియైఁ నన్నుఁ గనియుమ్మక చెల్లయటంచుఁ జూపులో
ల్లలవెగడొందు వాఁగని లజ్జనునిల్చిన యింతినెంచెదన్

ఉ॥ నిద్దుర లేచి వెన్కకొనిక్కుచు మేన్విరుపిల్లు జేయుచున్
దిద్దిన కొప్పునీడి యొకతీరు వగల్లులుకంగ రంగుగా
కొద్దిగవిప్పితిప్పి కనుగొంచును కన్నులు మోవిగంటులన్
తద్దయుజూచిచూచి నగు తన్వినిచిత్తములోఁ దలంచెదన్

ఉ॥ నేరముజేసినాఁడనను నేరుపుమాటల బుజ్జగించినన్
తీరనికోపమూని యటుద్రిప్పును మోమొకరాత్రి పుల్కలన్
తోరపుమేనినిండ తమిదొట్టఁగఁ గౌగిటఁజేర్చవచ్చి వ
ద్దోరియటంచు దుస్సహా మిదోయన బల్కెడికల్కినెంచెదన్.

చం॥ విరచితనిద్రియయ్యు నతివేగమె లేచియు చేతులెత్తి మే
న్విరచుచు, నావలించు నెడ పుల్లగుచొక్కపుటూర్పువాసనన్
తరుమగవచ్చి ఝుమ్మను మదభ్రమరభ్రమ దభ్రవిభ్రమ
స్ఫురిత మధుప్రతాచలిత శోభితనేత్రను కాంతనెంచెదన్.

చ॥ చెలియలతోడ ముచ్చటలు చెప్పగ నేఁగితిరించివోయిఁక
న్నులుకదియంగమూయుచుగనుంగొనువారలు చెప్పుమెవ్వరే
చిలుకల కొల్కిపీరన వచింపనొయమ్మ మెసంగనంచుఁ జె
క్కులుబులకింపగా నగిన కోమలినిప్పటికిం దలంచెదన్.

చం॥ మెలపున మోవినొక్కి తనుమిక్కుటమై నను గౌఁగలించి కొ
ర్కులనల రారఁ బైకొనినఁ గొంకక మేన్పులకింప సిగ్గు త
న్నలమిన యూర్పు దీపమొకయింత చలింపక? కర్ణభూషణో
త్పలమున ముద్దులేనగవు దాచిన యాచెలియుం దలంచెదన్.

చం॥ కలకలకంఠ కంఠముల గాదనుపల్కులు చొక్కమైన యుం
చలనడపించజాలునడ చక్కనిపున్నమ నిండుచందురుం
కలలడగించు మోమును శిఖండి శిఖండము కట్టగట్టి వే
నలి పగడంపు మోవిగలనాయక నామదినెంతు నెప్పుడున్.

చం॥ గమగమతెమ్మె తావిసమకట్టెడి మోమున నాదుమోవి తా
తమినిడిపూవుగోలలను, తాపమునొందినమేను మేను తో
సమముగ బిగ్గకౌగిటను, జారగనీకను పాన్పుమీదటన్
రమణముసేయుచున్న వలరాయనియింటి నిశానినెంచెదన్.

ం॥ రమణులతోడఁగూడి వలరాయని పూజకువచ్చి చొక్కమై
గమ గమమించుతావులను గ్రిక్కడు కేళివనంబులోన మే
లముబచరించు నన్నుఁగనిలాతిది యీచెలికత్తె రాకు పో
సమయము గాదటంచు, కనుసన్నలజేసిన కొమ్మనెంచెదన్.

చం॥ కులుకుమిటారిలేనగవు కొంచెమువంచుచు, ద్రిప్పిచూచు, ము
ద్దుల కడగంటిచూపులను తోరపుపయ్యెద జార గబ్బిగు
బ్బలవిడిబడ్డ కుందనపు బంగరురంగులు పూవుదేనె వా
నలుగురియించు పల్కులును నాపయి గుప్పిన జాణనెంచెదన్

ఉ॥ ముద్దుగ నిస్సుదోయి యరమూయుచు చేతులు కంకణంబులన్
రద్దొనరింపఁగా బాహులు రమ్యభుజంబులు మాటిమాటికిన్
నిద్దపు కాంతి చన్నుగవ నేర్పున వంచుచు వేలితో జెవిన్
తద్దయు జేయి గోరుటల దంభముఁ నన్గను కాంత నెంచెదన్

చం॥ కులుకుమిటారి గబ్బిచనుగబ్బలు బంగరునీరుఁ పైటపై
జిలుగని వళితేరియుంబుపయి చిందులుదొక్కఁగ ముద్దుట్కాఁడు, చే
తులు వెసమెత్తి మేన్విఱచి తోరపుపాక్కిలి గానవచ్చు నే
ర్పుల ననుగారవించు పువుబోణిని నెంతు మనాబులోపలన్

చం॥ సురతవిశేష కాలముల సూత్రితపుత్రిక చంద్రమోది దు
ర్భరజఘనాతి భారమున రమ్యశరీరము వాడ చొక్కమా
మపనిగృహంబుసొంపుల సమానతఁగాంచగ కొంతమూయుచున్
దెలచుచు కన్నుదమ్ములను తేకువనన్ను కాంత నెంచెదన్.

ఉ॥ తిన్ననిగాలిచే గదలుతీవగతిన్ గనుపట్టి పల్కులన్
క్రొన్ననవింటి రాజు చెలి గోటను మీటెనీ వీణెమోతలన్
సున్నగ జేయు నాగరిత సుందరమధ్యమ కామ దామ సం
పన్నసరోజ చంద్రముఖి భావములోఁగనుపించు నిప్పుడున్

చం॥ అలరి మిటారి తమ్మి మొగమందలి తావికివచ్చి ఝుమ్మనన్
తొలగని తేటి మొత్తముల తోట్రిలి బెగ్గిలి హుంకరించుఁ చే
తులు విదిలించి తోలుచు నెదుర్కొన జాలకవివ్వలాంగియా
చిలుకలకొల్కి ముద్దువగ చిత్తములోపల నెంతునిప్పుడున్

శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయము
సుల్తాన్ బజార్, హైదరాబాద్. 1.

చం॥ తరగక ముద్దుగుమ్మ యయి తోరమునం బెగడొందు సుందరిన్
తరుణిని తన్విమత్త సుగతప్రియ రమ్యకురంగలోచనన్
సరససుగంధమాల్య మణిచారు భూషణముల్ ధరించుచున్
బరగినహంసయానను శుభ్యాతి నిప్పటికిం దలంచెదన్

చం॥ బలసిన గబ్బిగుబ్బలను పైటదొలంగిన జక్కఁ జేయఁగా
దలచియొకింత వింతవగదార్చెదు చొక్కపుకుందనంపు గా
జులుచెయిసాచఁబూనుతరి సుందరి శంకనటించి బల్కునా
పలుకులువించు నవ్యకలభాషిణి నిప్పటికిన్ దలంచెదన్

చం॥ కులుకుమిటారి గబ్బిచను గుబ్బలవంగిన ముద్దుగుమ్మను
జ్వలనవనీలకుంతలను చంద్రనిభానన యౌవనాఢ్యమున్
జలకనకాంగి రమ్యతరశోణ మణీనిభదంత వాసి నే
దలచెద నిద్రమాపుగల తన్విని మన్మథ వైజయంతికన్.

చం॥ తళతళ కాంతిచే మొనల దంతములు జ్వలమైన మొల్ల మొ
గ్గలగెలువంగ మన్మథుఁడు కార్యమువచ్చిన వేయుతమ్మిపూ
ములుకులుజూపులన్ జలజమున్నెరిగొప్పున ముద్దుగుల్కుఁ జొ
క్కులసుఖయింపఁగోరియనుకూలముబల్కెఁడుకల్కి నెంచెదన్

చం॥ కలితరణన్మణీలసిత కాంచనకంకణముల్ కరంబులం
జెలువువహింపఁ జందురుగ్వశింపగజేసెడు మోముదమ్మి ము
ద్దులుగులుకంగ కూటమునిదోచిన సౌక్యనకన్నుమూసి మి
క్కిలి మదలోల సొంగియగు కీరమృదూక్తి నినెంతు నెమ్మదిన్.

చ॥ పగడపుంగోళ్ళమంచమున పానుపుమీఁదను బవ్వళించి సం
పగిపువ్వుదిండు బాల్చి కరపంజరమందొక వీణెమేళవిం
చిగళరవంబులన్ గరఁగఁ జేయుచుఁ బాటలు బాడుచున్మదిన్
చిగురుకటారి జోకబలుచిన్నెను గోరెడి కాంత నెంచెదన్.

ఉ॥ బంగరుదండి కుండలనిపంబుల బల్కెడుచన్నుదోయి, ర
క్తాంగుళిమధ్యరేఖల హొయల్గలచేతులు భీతపూత సా
రంగవిలోచనంబులు నిరంతరమన్మధ బాణపద్ధము
ద్ధాంగ మణీయమై చలితమైనవలగ్నము బింబసన్నిభా
భంగవిలాసితోష్ఠమును బాటిలుపాటల గంధి నెంచెదన్

ఉ॥ వేడుకమీర బాడిగురువిందపు పూవులబంతి కేలు ము
ద్దాడఁగ నేటవాలుగ హొయల్గలముత్యపు పేర్లుదాల్చియున్
బోడిమియైన నెమ్మొగము పున్నమచందురు మీరఁగల్గి పూ
బోడిని గెల్చు చక్కదనముంగల యంగన నెంతు నెమ్మదిన్.

చ॥ మరుడను మావటీఁడు, ననుమత్తగజంబుగ నెంచిచూపనే
గురుతరశృంఖలంబున నకుంఠితబంధము గల్గునట్లు దు
ర్భరకదలీ నిభంబులయి పాటిలుసక్థుల పెద్దమోదులన్
దిరవుగ గట్టివైచె పసమేమివృథోక్తుల కాంత నెంచెదన్

చ॥ వదలడుగా సదాశివుఁడవశ్యమునిప్పటికిన్ విషంబు తా
ముది కమఠంబు నేటికిని మోయుగ ధాధర వాహినీశుడున్
కుదిరి చెగాదె యిప్పటికిఁ గుక్షిని బాడబవహ్ని యట్టులే
గదయొక కార్యమొప్పి బుధకాండము పాలన సేయుచు నెప్పుడున్

ఉ॥ మేనొగి పంచతందనగ మేళవమొందును దత్తదంశకాల్
నేనొకవిన్నపంబు విధనికొనరించెద మొక్కి వేడ్కతో
నానలినాక్షి వాపి జలమూ చెలియద్దము నగ్నియామ్యగాం
కానన యుగ్మముందు చదలాసతి చామరముందువాయు, వా
సూనసుగంధ దారినిల సుస్థితిచే నిలసిలుగాన్పతన్.

వ॥ అనియిట్లు బిల్హణుండు వింతింపు మాడ నంతకుమున్న
యంతఃపురంబున.

చం॥ గురువగుబిల్హణున్ నృపుడుకోపముసిల్పక చంపుమాచుం జె
చ్చెరసెలవిచ్చి పంపెనని చేడియ జెప్పగ కన్యమేనుతా
నెరుగక, గుండెఝల్లుమన నేలను నేలను పొర్లిపొర్లి ని
బ్బరమగుమూర్ఛనొప్ప నశుభప్రభమూర్ఛలి లేచియిట్లనున్

ఉ॥ హారమణీ ప్రసూనశర హాకవిశేఖర హామనోహరా
హారమణీయ వాగ్విభవ, హాచతురానన హాశచంద్రమా
హారసికావతంసవర హాజగతీపతి వారవందితా
హారతిజానిశాస్త్రచణ, హానుమభూషణ హాహా బిల్హణా.

శా॥ ప్రాజ్ఞేశా తెరచాటునన్ సకలశాస్త్రాభ్యాసముం జేసి, నీ
ప్రాణంబుల్ గొనజూచితిన్ గురుండవున్ బ్రాహ్మణ్యగణ్యుండవున్
ప్రాణంబుల్ త్యజియించెదన్ జగతిం బ్రహ్మఘ్నదోషము
వ్వాణీజానియు సేయ రాదనుచుం బ్రాబల్యకు ల్వచించుంగదా.

క॥ యేటికినిన్ను జూచితిని యేటికినిపయి మల్లుకొంటి, నీ
వేటికినన్నుఁ గోరితిటు లేటికిఁ గూలమియయ్యె రాజు తా

కనకాంగిరమ్మని ఘనహారములు మెడ
నింపుగా వేయు వారెవ్వరింక
జలజాక్షిరమ్మని కులుకుచుఁజన్నుల
(నెలమిమర్దించు వారెవ్వరింక)
రమణిరారమ్మని మమతఁగౌగిటఁజేర్చి
(నవ్వించి యేలువా) రెవ్వరింక.

గీ॥ పాన్పుమీదను ననుగూడి పవ్వళించి
ఇంచువిలుకాని శాస్త్రంబులెవ్వరింక
లక్ష్యలక్షణ పూర్వవిలక్షణముగ
నరసిచెప్పెదరహహా బిల్హణకవీంద్ర.

ఉ॥ చోరకవీంద్ర నాకయి విశుద్ధిగ నీవుశరీరమిట్లు పెం
పారగనిచ్చి నీవిపు డయారె తదుత్తమ లోకయాత్ర, వి
స్ఫారతఁ బూననాయెడల ప్రాణములుంచితి లోకనిందయున్
నారక వేదనల్ తరుచునన్నుఁ దపింపగఁజొచ్చె నక్కటా

ఉ॥ తీరనికోర్కులన్ రతుల తేకువ నాప్రియుడైనయట్టి, యా
చోరకవీంద్రు కౌగిటను సొక్కుసుఖంచిన నేను, పొందుగా
గోరుదు నేమఱొక్క నృపకుంజరపుత్రుని శర్కరాసుభో
దారరసజ్ఞనింబరస, ధారణఁగ్రోల దలంచునే భువిన్.

కం॥ మొదట మముగూర్చినప్పుడు
ముదమొదవగ నీదుశాణముల నేసితివో

మదనా మదనాశత స
మ్మదుఁజోరుని రాజుచంప మదిఁజూచెదవే.

కం॥ కేకీ కోకీ శౌకీ
పైకీ మీరైన యడ్డపడరాదా శో
కైకాయతావ లోకను
నాకాద్యుల్లోక లోకు నతిధృతితోడన్.

కం॥ ఆళీ రాజమరాళీ
యాళీ కేళీవనాంత రావనిజాళీ
హాళిన్ బాళిన్నాదువి
రాళిన్ నృపమాళిఁ దెల్పరా లేరుగదా.

కం॥ ఈరీతిబాష్పధారా
పారావారమున వదనవనరుహశోభా
దూరీకృతమై కన్నియ
ధారుణిబడిమేను వదలఁదలఁచుచు నుండెన్.

వ॥ కన్యాంతఃపుర రక్షకులగు ద్వారిక తల్లజు లప్పల్ల వాధరంగని, తడబడి యెల్లెడలంజూచుచు రాజసమీపంబున కరిగి తగురీతింగని యిట్లని విన్నవించి రది యెట్లనిన.

మ॥ ధరపైఁబ్రాలుచు లేచుచున్ బొరలుచున్ ధమ్మిల్లమూడన్ కుచో
పరిహారంబులు నుగ్గుగాఁ గనుగవంబాష్పంబులుప్పొంగి, ని
ర్ఘరరీతిన్ బ్రవహింపఁగంఠమున నిర్బంధంబుగాఁబైటచే
నురితాఁబోయఁదలంచె సీతనయ హా యుక్తేశ్వరావింటివే.

గీ॥ గురుఁడుపాత్రిణేశ్వరుఁడు విప్రకులవతంసుఁ
డైన బిల్హణుఁడిపుడు రాజాజ్ఞవలనఁ
దెగని మునుపేనువేగమే తెంపుసేతు
ననియె కన్నియ; వింటివే జనవరేణ్యా.

కం॥ అనివిన్నవించు తఱి బి
ల్హణువెంగటనుండి భృత్యులరుదెంచి "శిరం
బునువడిఁ ద్రెంపంబూనిన
మనమున సంతోషవార్ధి మగ్నుండగుచున్.

కం॥ కలకలనగి కన్నియతోఁ
గలసి మునుపు జేసినట్టికామక్రీడా
విలసనములు తలఁచుచు ని
శ్చలుఁడై యతఁడున్నవాఁడు జనవర" యనుచున్.

కం॥ వినిపించిన ధరణీపతి
తన తనయకు, బిల్హణునకుఁ దఱచుగ మమతల్
గొన కొనియెననుచు జంపకుఁ
డని బిల్హణుఁబిల్వఁబంచి యంతట వేగన్.

కం॥ త్వరపడుచున్ కన్యాంతః
పురమునకుంజనియె రాజుపొక్కుచు మదిలోఁ
బురపుర కన్నీరొలుకగ
పరువుననచ్చటికిఁ కల్పవల్లియువచ్చెన్

వ॥ చనుదెంచి, యజ్జననీజనకు లచ్చట విచ్చలవిడి బెరిగిన బిల్హాణవధోపక్రిమ జనిత దుఃఖాంభోదిదాటదరి నత్తరి గానక నేల పయింబడి పొర్లుచుఁ కన్నీరు మున్నీరుగా నేడ్చుచు సిగముడి జిక్కుబడినకురులను చెరగిన కాశ్మీర తిలకంబును, చెదరిన మకరికాపత్రంబులును, తెగిన ముత్యాల హారంబులును, ధూళి ధూసరితంబైన దుకూలంబును బడలిన మవ్వంపు మేనును, యుబ్బినరెప్పలును, వాడిననెమ్మోమును గల్గి దెంపుజేసి నిజ కంఠంబున,నకుంఠంబుగా నురి దవిలించుకొని యున్నంగనుంగొని నేఁజెల్లనోయమ్మ యిది యేమి పడుచుఁదనంబని, రోదనంబు సేయుచుఁగల్పవల్లి తల్లడిల్లి యురి వదలించి కౌగింటంజేర్చి బుజ్జగింపుచు తనయ కిట్లనియె,

కం॥ అమ్మా వెఱ్ఱివి గదవే
యిమ్మెయి మెయి విడువబూననేటికి మదిలో
నుమ్మలిక బాపు బాపురె
సమ్మోదమొనరింతు నీకుసమ్మోద మొదవన్.

కం॥ అని తల్లి మాటిమాటికి
తనుమిక్కిలి బుజ్జగింప దట్టపుతమిచే
తను వెక్కి వెక్కి యేడ్వగ
వనజానన యంతఁగల్పవల్లి తనప్రియున్.

కం॥ కనుగొని యిట్లనియెను
జననాయక నీదు మదికి సంతోషంబే

మనతనయ మేను విడువం
బనివడి యత్నంబుసేయఁ బలుకవు మేలే.

మ॥ రమణా నీమనసెంత కట్టడిదయో రాకేందుబింబాస్య యీ
రమణీరత్నము నీదు నందవగదా రాగాంధయై మున్ను నే
రము లాపార్థునితోడ జేసెనని నిర్దాక్షిణ్య చిత్తంబునన్
క్షమ సుంతైనను లేక యీసరణి నాజ్ఞాపింపగా నేటికిన్.

కం॥ గురునకు కైంకర్యంబీ
తరుణి యొనర్చినది ముఖ్యధర్మము నీవీ
తెరవెల్ల శాస్త్రసమ్మత
సరణియనుచుఁ జేసితివి విచారింపక యే.

ఉ॥ ధరణీ నిర్జరుఁజంపినందున మనస్తాపంబునన్ కన్య బం
ధురనిర్బంధ మృతింగనుక్ నృపమణీ తోడ్తోన నామీద చె
చ్చెర స్త్రీహత్యయు బ్రహ్మహత్యయునుని శ్శేషంబుగా నీకులం
బరుదారగ నశియింపజేయు బహుదోషావాప్తి యంతేగదా.

చం॥ నరకము వంశనాశనము నాథుఁడ మేలో కులంబు పుణ్యమో
కరతని జెందగోత్రము జగంబున వన్నియ కెక్క కన్నియన్
వరమణియైన భూమిసురవర్యునకిచ్చి యశమ్ము జెంది భా
సుర సురలోకసౌఖ్యములు సుస్థితిగాంచుట మేలొ యెంచినన్

కం॥ కావున వడి దేవా భూ
దేవాగ్రణికొసఁగ కూతు, దేవస్తోత్రము భూ

దేవహితంబును మానవ
దేవహితమ్ము నిఖిలపితృదేవహితంబున్.

వ॥ అగునని విభుని చరణములపై ననితరవాక్యముగ వ్రాలెనా
యమ;రాజాగ్రిణి దీనమానసుండై తనప్రియనటు లేవనెత్తి తత్తర
పడుచున్ గద్గదకంఠుండై యిట్లనియె.

మ॥ వినుమావల్లభ దీప్తకోపముననే విప్రాగ్రణిన్ జంపుడం
చనిపంపించితి మోసమాగద గ్రుతంచార్యా నకుర్వీత కిం
చనవాకార్యమటంచు బల్కుదురు రాజస్త్రీలఁ బెండ్లాడ రా
దని శాస్త్రంబవనీసురావళికి నిషేదార్థంబు బోధించునే.

గీ॥ దానపాత్రము బ్రాహ్మణోత్తముండె కాడె
కావునఁగుమారి నా చోరకవివరునకు
శాస్త్రబుధజనవర బంధుసంయుతముగ
నిచ్చి ధన్యత నొందెద నేనుజగతి.

కం॥ అని పల్కితనయ తోడుత
ననియెన్ మాయమ్మచింతవిడువు మకటా నిను బి
ఌ్బాణువకొసంగెద నమ్మము
మనమున సంతోష మొదవ మహితస్థితిచేన్.

గీ॥ అనుచువారల నూరార్చి యంతనంత
పురము వెలువడి నరపతిపురము పెండ్లి
వేడ్కకై భూరిశృంగార విహితసరణి
చేయఁబని చెను భృత్యని కాయమపుడు.

వ॥ అంత

గీ॥ కొలువుకూటంబునకు రాజకుంజరుండు
వచ్చిసభ జేసి కూర్చుండి వసుమతీశ
మంత్రివిబుధజనంబుల మహితరీతి
పిలువ నంపించి యెల్లర నెలమిఁజూచి.

కం॥ ఘనుఁడగు బిల్హణ కవిచం
ద్రుని కర్ధాసన మొసంగి తోరపు చిరు న
వ్వున చంద్రశేఖరునితో
ననియెన్ సభ్యులకుఁగార్యమతి శీఘ్రముగన్

వ॥ వినిపించి మహారాజానుగ్రహంబు గొనుమనిన నతండు
వారల కిట్లనియె.

ఉ॥ వింటిరె సభ్యులార పృథివీపతినందన కావ్యపాఠమున్
గిట్టక చోరుసన్నిధిని కృత్రిమభక్తిని మోముజూపకే
యొంటరి పాటువంజదువ నొయ్యనవారికి పొందుపొందెఁ జూ
వింటిమిటూరి నేర్పున కవిప్రభుఁడా చెలితోడ నుండగన్.

వ॥ కొన్నిదినంబు లరుగునంత.

మ॥ ఒక నాఁడా కవికన్యకామణుల కామోద్రేక సంభోగ న
వ్యకలాపంబులు రాజెఱింగి నియతిన్ వాంఛించి శీఘ్రంబ వి
ప్రకవీంద్రున్ వధియింపఁబూనొ్కనఁగఁదాపంబున్ సహింపంగ లే
క కుమారీమణి తెంపు జేసుకొని తాఁగంతంబు బంధించినన్.

కనుత్రైన కల్పవల్లీ మదనాభిరాములు కన్నియ
ర్తణునకు కన్యాప్రదానంబు విశేషఫలప్రదంబని
నానుగ్రహంబపేక్షించి మీకు విన్నవింప నిపుడ
-ర్యారంభంబునకు శుభోదర్క తర్కపూర్వ
బు వచియింపుడనిన వారలిట్లనిరి.

రాము ధరణీశ్వరు భాగ్యము జెప్ప శేషభా
తీశ గురుశక్రులకైనను శక్యమే ద్విజో
సద్ధుడయి తద్దయు బెద్దగు బిల్హణాఖ్యుగ
ప్ర...లకు నాదితు జేయదలంచినందునన్

న వంశ్యుడు మదనసుంద
పం డఖిలవిద్యాచణుండు
ుకి భవ్యాంగియైన
కంటె భాగ్యంబుగలదె.

చోరకవిశేఖరుకై ప్రమదం బెసంగన
...తిశయ కూతురునిచ్చు తలంపుచే బుధ
కాసక్రతి శోభితసద్గుణ రత్నరాశియా
ము భువనేశ్వరుడెంత విశుద్ధమూర్తియో

తిసభికులు వక్కాణించినవిని యత్యంతసంతోష
ందగుచు, సమ్మోహిం మహేంద్రుండు చోర
మూనంబుగా కర్పూరవాసిత విటకాదికంబొసంగి

యితరవిద్వత్సభాసదులు నంచితగీతిని సత్కరించి యథాస్థానం బునకుంబనిచి కన్యకాపరిణయోపక్రమ కుతూహలంబున మంద హాస భాసమాన వదనారవిందుండై, చంద్రశేఖరు మొగంబు జూచి యతనితో నిట్లనియె.

గీ॥ భువనమోహిని యామినీపూర్ణతిలక
పరిణయంబిట్లు సమకూడె బంధుజనుల
పిలువ నంపింపఁ దగువారిఁబెట్టి పంపు
మనిన నాచంద్రశేఖరుఁడట్లొనర్చె.

ఉ॥ అంతట నేగుదెంచిరి సమగ్రమదేభ తురంగపాళితో
కుంతల మాళవద్రవిళ ఘోటకభోట మరాటలాట, భూ
కాంతశిఖామణుల్ తగినకానుకలంగొని నిండువేడుకన్
స్వాంతముచల్లజేయ జలజాతవిలోచన పెండ్లిజూడఁగన్.

గీ॥ రాజమండల శోభా విరాజితమయి
మహితగురు బుధకవి లోకమండితము గుఖు
లలితలావణ్య లక్ష్మీవిలాసమగుచు
భాసురంబయ్యె లక్ష్మీనివాసపురము.

ఉ॥ అంతట భూవిభుండు సముదంచితలీల సమాగతావనీ
కాంతశశాంకులం దగిన కాంచనరత్నవిభాస్వదాల యా
భ్యంతరసీమనుంచి తనయా సముదార వివాహకాల మ
త్యంతమనోవికాసకరమై నెఱికోర్కులు నింపుచుండఁగన్

శా॥ యెన్నాళ్లచ్యుతుఁడాత్మవక్షమునఁ దానింపొందఁ శ్రీనుంచునో
యెన్నాళ్లబ్జజుఁడా స్యగహ్వరము నందిల్లాలినిం దాల్చునో
యెన్నాళ్లీశ్వరుఁడర్ధదేహమున నద్రీంద్రాత్మజం గూర్చునో
యన్నాళ్లీకృతిపెంపు గాంచుధరలో నాచంద్రతారార్కమై

ఉ॥ బాగు సుహృన్నిరంతర శుభంకర వైభవశీల సర్వ పు
ష్పాంధయవేణికా నయన పంకజభాను సమానదేహ ప
త్రైన్నాంధవపాదఘట్టన రసాప్రసరద్భవహు చూర్ణ దుర్నిరీ
క్ష్యాంధజనాయి తారిమనుజాధిప శౌర్య సురేంద్రనందనా.

కం॥ మందర ధీరా యాచక
మందారా రసికవర్య మనుజార్యజనా
నంద విధాయక సేవిత
నందాత్మజ పాదజలజ నందిత విబుధా.

మా॥ కనకకుధరధీరా ఖండితారాతిపీరా
ఘనతరసుచరిత్రా కాంతతాక్రాంతచైత్రా
సనయ సకల శిక్షా సారసాహిత్యరక్షా
జనిత నిజజనాళీ సంతతానందహాళీ.

గద్య. ఇది శ్రీమదరవిందనాభ పదారవింద మిళిందాయమాన
మానస భారద్వాజ పవిత్రగోత్ర చెన్నూరు రామ
చంద్రకవీంద్ర... విరచితంబైన శృంగారసుధాసముద్ర
పూర్ణచంద్రోదయంబను మహా ప్రబంధమునందు
చతుర్థాశ్వాసము. సంపూర్ణము

# రాయబారము విన్నారా?

"చదివిన భారతమునే చదువవలెను. తినిన గారెలనే తినవలెను" అన్నసామెత మఱచిపోవలదు. భారతములో నిమిడి యున్న యత్యద్భుతమైన ప్లాటు బయలుపడినది. వ్యాసుని హృదయకోశము తెరచితిమి. నాలుగు రాయబారముల సారాంశము అత్యద్భుతమైన "మిస్టరీ" లో నిమిడ్చి వెల్లడించినారము. శకుని దుర్యోధనులు శ్రీకృష్ణునెడల పన్నిన పన్నాగము—అత్యద్భుతమైన విషమరహస్యము. శ్రీకృష్ణుడు ఏవిధముగ తప్పించికొని, తన దివ్యప్రతిభను వెల్లడించెనో ఈరాయబారమున తెలియగలదు. వెంటనే మాకు వ్రాయుఁడు.

వలయువారు:— భాగవతుల నృసింహశర్మ,
వేగుఁజుక్క గ్రంథమాల,
పూండిపెద్దివారివీధి, బరంపురం, (గంజాం.)

## దొంగలున్నారు జాగ్రత!

అసలు నకలు భేద మెఱుంగుఁడు. మాగ్రంథముఁజూచి "ఇమిటేషన్" గ్రంథము కడుపు కక్కురితి కెవరైన ప్రకటించిరేమో మోసపోకుఁడు:— దొంగలున్నారు జాగ్రత !



గమనింపుఁడు:— మాగ్రంథమాలనుండి వెలువడి విక్రయమునకు సిద్ధముగానున్న గ్రంథములన్నియు యొకేసారి కోరువారికి మిక్కిలి తక్కువ వెలకొసంగఁబడును వలయువారికి మాకేటలాగు పంపఁబడును.

# రాయబారము

(మహాభారత రాజకీయ విప్లవము)

ఈ రాయబారముఁగూర్చి చిత్రపటములతో సహా ఎల్లెడలఁ బ్రకటించియే యున్నారము. ఇందు చక్కని చిత్రపటములు *Half tone Blocks* గలవు. భారతకాలము నాటి మన మాతృదేశపటము గలదు. కౌరవ వంశవృక్షము గలదు. ఇది మూడుఖండములు, 43 ప్రకరణములు, 300 పుటలు, 5 చిత్రపటములు గల గ్రంథము. నవలవలె హృదయము రంజింపఁజేసి, కావ్యమువలె జ్ఞానప్రదమై, నేటి రాజకీయలోకమునకు దర్పణమై, తుదిముట్ట చదువనిదే విడువనీయని యత్యద్భుత సంఘటనలచే స్తంభీభూతత్వమును, దిగ్భ్రమను బొందించి తన్మయతఁగలిగించి యలరించు నూతన గ్రంథరత్నము. భారతాంతర్గత పురాతన రాజకీయకథా వృత్తాంతముగల్గి, శ్రీకృష్ణుని దివ్యప్రతిభా విశేషమున శోభిల్లి విశ్వరూపప్రదర్శనముచేఁ బవిత్రితమైనది. పరమాత్ముని యుక్తి—నరునిశక్తి.

విలువ రూ. **1—8—0** లు (ఖర్చులుగాక)

ఈక్రిందఁ జేర్కొనఁబడిన భాషావిశారదు లీ గ్రంథము నధికముగ గొనియాడి సదభిప్రాయముల నొసంగినారు:—

1. మ. రా. శ్రీ కవిశేఖర వఝ్ఝాది సుబ్బారాయుడుగారు.
2. శ్రీయుత వంగోలు వేంకటరమణయ్యగారు, బి. ఏ. బి. ఎల్.
3. ,, ఆ॥ శేషగిరిరావుగారు, బి.ఏ. (ఆంధ్రభూమి)

ఈ గ్రంథమును ప్రశంసించిన పత్రికలు:—

1. ఆంధ్రభూమి. 2. గృహలక్ష్మి.
3, న్యూ ఒరిస్సా. 4. భారతి—(మదరాసు)
5 . రెడ్డి పత్రిక. etc.

# NIRJARA

## రక్తశుద్ధికి — నిర్జర — ధాతువృద్ధికి

ధాతువు కారణాంతరములచే క్షీణించినపుడు నరములకు దౌర్బల్యము సంభవించును. మరియు మిక్కిలి వేడిమిబుట్టి, యందువలన రక్తము చెడిపోవును. పైత్యవికారము, ధాతుదౌర్బల్యము, నిస్సత్తువ మొదలగునవి సంభవించి మగతనమునకు లోపము కలిగించును. ఈ నిర్జర యను ఔషధరత్నము రోగులు, ఆరోగ్యవంతులు సేవింపఁదగినది. అజీర్ణము తొలగించి, అగ్నిదీప్తి కలిగించి, ఆహారవిహారాదులయందుత్సాహమును బలమును గలిగించుటలో దీనిని మించినది లేదని ఆయుర్వేదమహర్షులు ఘోషించియున్నారు. మనపూర్వరాజులు దీనిని సదా సేవించుచుండెడివారు ప్రమేహాది దుర్జయరోగములకు మానిర్జర వజ్రాయుధమని ఘంటాపథముగ చాటుచున్నారము. ఉడుకులకు, వాంతులకు పైత్యవికారమునకు దారుణమేహవాతాదిదోషములకు తిమ్మిరులకు మూలవ్యాధులకు సెగసవాయిలకు, ఉబ్బుపాండువులకు, ఈయౌషధముపయోగింపనిచే ఇంకొకయౌషధముపయోగించి మోసపోకుడు.

20 దినములకు సరిపడు డబ్బా 1కి రూ 2/- లు మాత్రమే.

ఖర్చు కొనువారే భరించవలెను.

ఆయుర్వేద విశారద, వైద్యవిద్వాన్, శ్రీరంగం వేంకటరత్నం,

ఆర్ష వైద్యభవనము, కరణంవీధి, బరంపురం, (గంజాం).

---

## శ్రీ రామముద్రణాలయము

బరంపురం, (గంజాం.)

ఇచ్చట అన్నివిధములగు అచ్చుపనులు—బుక్ వర్కు, ఫోటోలు, కేలండర్లు, నోటీసులు ఉత్తరాలు చక్కగ ముద్రించి సకాలమునకు అందచేయగలము. ఇంగ్లీషు, తెలుగు, ఒరియాలో ప్రకటనలు ముద్రించి ఈజిల్లాయంతటను ప్రకటింపఁదగిన యేర్పాటు చేయఁబడును వెంటనే వ్రాయుఁడు:— భాగవతుల నరసింహశర్మ: ప్రొప్రైటరు

